# ఇనుపకచ్చడాలు

తాపీ ధర్మారావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

**INUPAKACHHADALU by Thapi Dharmarao**

ప్రచురణ సంఖ్య 2350 /1482 R
ప్రతుల సంఖ్య 1000
గత ముద్రణలు 1975, 1982, 1986, 1990
ఐదవ ముద్రణ జనవరి, 2005

© తాపీ రాజమ్మ

ముఖచిత్ర పత్రం డా॥ బాపు

**వెల : రూ. 20-00**

ప్రతులకు **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞానభవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001
E-mail visalaandhraph@yahoo com

**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ

ముద్రణ: విశాలాంధ్ర ప్రెస్, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

# సిగ్గుబిళ్ల పూర్వాపరాలు

ఇనుపకచ్చడాలు-ఇంత కాలానికి విశాలాంధ్ర ప్రచురణాలయం వారు తీసుకొచ్చారు. తాపీ ధర్మారావుగారు జీవించి ఉన్న కాలంలోనే వీరు దీన్ని ప్రచురించాలని చాలా ప్రయత్నం చేశారు. సఫలీకృతులు కాలేక పోయారు.

కాగడా వారపత్రికలో జనవరి 1940 నుండీ జూలై 1940 వరకూ ఈ వ్యాసాలు ఆనాడు ప్రకటితమౌతూంటే పాఠకులు విశేషమయిన ఆసక్తిని కనబర్చారు. ఈ నూతన భావాల ప్రచారంతో క్రమంగా పత్రిక సర్క్యులేషన్ ఊహాకందని విధంగా పెరిగింది. ఆ వ్యాసాల రుచి చూసినవాళ్ళంతా అవన్నీ ఎప్పుడెప్పుడు పుస్తకరూపంగా వస్తాయా! అని ఇన్నేళ్ళూ ఎదురు చూశారు. ఇప్పటికొచ్చింది.

తాపీ ధర్మారావుగారు ఈ వ్యాసాలను ఆనాడు ప్రచురించటంలో ఓ ఉద్దేశం వుంది. అంతవరకూ తాతాజీ; అటు భాషాపరంగానూ-భావాల పరంగానూ ఒక అంచుకుంటూండేవారు. పాండిత్యమన్నది ఒక వర్ణానికే చెందిందనుకుంటున్న సనాతనభావం ఆయన్ను కలతపెట్టింది. దాంతో, ఆ వర్ణాన్ని ఎదుర్కోటానికి ఆ పద్ధతిలోనే పాండిత్యం సముపార్జించు కున్నారు. వారిలాగే భాషాచర్చా-ప్రబంధాల అధ్యయనం-పారనిర్ణయాలపై వాదోపవాదాలూ చేయటం మొదలెట్టారు, భాషకూడా ఆ వర్ణాలకే ప్రాతినిధ్యం వహిస్తూందన్న భావంతో అలాంటి వీర గ్రాంధికవాదిగా ఉంటేనే ఆ వర్ణంకన్నా గొప్పవాళ్ళం కాగలమనుకున్నారు.

ఇలా ఉండగా-కొంతకాలానికి ఇతరదేశాల సాహిత్యం తనకు అందుబాటులో కొచ్చింది. జమీందార్ల కొడుకులకు ట్యూషన్ చెపుతూన్న సమయంలో జమీందార్లతో సంబంధాలేర్పడ్డాయి. ఇవి వీరికి అనేకదేశాల గ్రంథాలు తను అధ్యయనం చేయటానికి అవకాశం కల్పించాయి.

ఇరవై శతాబ్దం రెండవదశకంలో సామాజికశాస్త్రం విశేషప్రాచుర్యం పొందింది. క్రైస్తవ ఫాదరీలు మతప్రచార పర్యటనల సందర్భంగా

అనేకదేశాలకు వెళ్తూండేవారు. ఆ దేశాలలోని ఆటవిక ప్రజల ఆచార వ్యవహారాలను- భాషను - సంప్రదాయాలను నమోదుచేయటం మొదలెట్టారు. అంతకు ముందునుండీ వచ్చిన అలాంటి సమాచారాన్ని క్రోడీకరించిన ఉద్గ్రంథం ఫ్రేజర్ రాసిన గోల్డెన్ బౌ. ఈ పుస్తకం ఒక సరికొత్త మానవ పరిణామశాస్త్రాన్ని ఆవిష్కరించింది. పశ్చిమదేశాలలో ఇలాటి పుస్తకాలు చర్చి పునాదులను సైతం కదల్చాయంటే అతిశయోక్తి కాదు. గతంలో డార్విన్ సిద్ధాంతం జీవపరిణామాన్ని శాస్త్రబద్ధంగా నిరూపించి క్రైస్తవమతాన్ని కుదిపితే: మానవ నాగరికత క్రమ పరిణామ పర్యవసానమే కానీ, మతగ్రంథాలు చెప్తున్నట్టు సర్వోత్తమ మానవుడు ఆదిలోనే సృజింపబడ్డాడన్న వాదాన్ని ఈ సరికొత్తగ్రంథాలూ, ఇవి వెల్లడించిన అంశాలూ తునాతునకలు చేశాయి.

ఈ గ్రంథాల అధ్యయనం తాతాజీలో పెద్దమార్పును తెచ్చింది. ఈ పుస్తకాలు నేటి నాగరిక సమాజంలోని అనేక గుడ్డినమ్మకాల మూఢాచారాల ముడులు విప్పాయి. అనేక పదబంధాల, పలుకుబళ్ళ, సామెతలలో వెనక తరతరాల సంచితమయిన మానవ సాంస్కృతికజీవనం ఇమిడి ఉందనీ బోధపడ్డాయి. దాంతో, ఈ విశ్వాసాలూ, అజ్ఞానం అన్నవి-అది అగ్రవర్ణం కానీ, అధమవర్ణం కానీ-పరిశీలిస్తే అందరిలోనూ సమంగా ఉండటం తాతాజీకి గోచరించింది. అంతే! అంతవరకూ ఏ బ్రాహ్మణవర్ణం అన్నా-అన్ని విషయాల్లో వారి ఆధిపత్యం అన్నా, వారు ప్రయోగించే భాషన్నా వీరికున్న సనాతన వైరభావం మటుమాయమయింది. దృష్టి విశాలమయింది. ఈ నూతనభావాలను ప్రజలకు తెలియపర్చటం విధి అనుకున్నారు. అందుకనువుగా భాషనూ మార్చుకున్నారు.

అప్పటికే పత్రికారంగంలో సమదర్శిని సంపాదకులుగా పేరు ప్రఖ్యాతులు పొందారు. 'దేవాలయాలపై బూతుబొమ్మలెందుకు?' అన్న వ్యాసాలను గూడవల్లి రామబ్రహ్మంగారి సంపాదకత్వాన వెలువడుతున్న ప్రజామిత్రలో ప్రచురించటం ద్వారా తనకో స్థానాన్ని ఏర్పర్చుకొన్నారు. ఆ సామాజికశాస్త్రాల ఆధారంగానే పెండ్లితంతును, 'పెండ్లి, దాని పుట్టు పూర్వోత్తరాల' వ్యాసాల్లో (కాగడా వారపత్రికలో జూలై 1940 నుండి

డిశంబరు 1940 వరకూ ప్రచురితమయ్యాయి) వ్యాఖ్యానించారు. ఆ పరంపరలో ఈ ఇనుపకచ్చడాలు రెండోది.

మనుచరిత్రలో ఉన్న పద్యపాదాన్ని అందులోని ఇనుపకచ్చడాల ప్రసక్తినీ తీసుకున్నారు. ఇక్కడ తాతాజీ దృష్టి శబ్దపరంగా ఉత్పత్తి చూట్టంగానీ, సాహిత్యపరంగా ఏఏ గ్రంథాల్లో ఇనపకచ్చడాల ప్రస్తావన ఉందో వెతకటం కానీ కాదు. దీని వెనకవున్న సామాజిక ఆచారాన్నీ, దాని వెనక దాగిన ప్రాచీనకాలం నాటి నీతినీ బట్టబయలు చేయటమే ఆయన ప్రధానోద్దేశం. దీన్ని ఆధారంగా చేసుకొనే తాతాజీ దీని చరిత్రను ఇతర దేశాల చరిత్రల నుండీ, సామాజిక ఆచార వ్యవహారాలను విడమర్చే గ్రంథాలనుండీ కొత్తదృష్టితో వ్యాఖ్యానించారు.

సంస్కృతగ్రంథాల్లో; క్షేమేంద్రుని రచనలు నాటి ప్రజాజీవితాన్ని, ఆచార వ్యవహారాలనూ నమోదుచేసినంతగా మరేవీ చేయలేదు. అంతకన్నా ప్రాకృతగ్రంథాల్లో జనజీవితం మరింత హెచ్చుగా వర్ణితమై వుంటుంది. బహుశా ఆ గ్రంథాల్లో ఇనుపకచ్చడాలూ, ఇతరసాధనాల ప్రసక్తి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వుండివుండచ్చు. ముఖ్యంగా జానపదకథలూ-గాథలూ ఇలాటి తండాల జనజీవిత ఆచార వ్యవహారాలకు గనుల్లాంటివి. ఆదిమసమాజం వీటిల్లో ప్రతిబింబించినంత నిసర్గంగా మరెందులోనూ వుండదు. నేటి మన నాగరికసమాజంలో అనేక సందర్భాల్లో అలంకారాల్లో, పలుకుబళ్ళూ-సామెతల్లో, పండగలూ-పబ్బాల్లో ఇవన్నీ రూపం మారీ, కర్మకాండ మారీ కన్పిస్తూంటాయి. "ముద్దర్లుముద్దర్లుగా వుండగానే ముగ్గురు బిడ్డల తల్లయింద"న్నదో సామెతయి అలాటిదే ఈనాడు చిన్నపిల్లలకు అలంకారంగా కట్తూండే "సిగ్గుబిళ్ళ"గా నిలిచిన ఆనాటి ఇనుపకచ్చడం.

దీని పుట్టుకను తెలుసుకోవాలంటే సమాజంలో స్త్రీ పురుష సంబంధ పరిణామాలను స్థూలంగానైనా మననం చేసుకోవాలి.

మాతృత్వం వాస్తవం. పితృత్వం విశ్వాసం. అంటే ఒకటి ప్రత్యక్ష ప్రమాణం. రెండోది శబ్దప్రమాణం. ఆస్థి సమాజపరంగా వుండి

కుటుంబపరంగా కానంతవరకూ ఆస్తికి వారసత్వసమస్య తలెత్తలేదు. అప్పుడు పిల్లల పితృత్వాన్ని పట్టించుకోలేదు. దీనికి ఉదాహరణలు కోకొల్లలు. కాద్రవేయులు: దైత్యులు లాంటి పురాణోదాహరణలు-

సమాజం మాతృస్వామ్యం నుండి పితృస్వామికానికి వచ్చింతర్వాత కూడా రాజుకు బహుపత్నీత్వం ఉన్నప్పుడు ఆయన వారసులు రాజు కొడుకులంటే చాలదు. ఆ రాజుకున్న ఏ రాణి కొడుకన్నది చెప్పుకోటం అవసరం. ఈ సందర్భాల్లో ప్రాచీనకాలం లోని మాతృస్వామ్య అవశేషాలయిన తల్లి పేరుంచుకోటం కొందరిలో మిగిలింది. ప్రాచీన తండా ఆచారాలన్నీ అలాగే మిగిలుంటాయని కానీ, అన్నీ నశిస్తాయని కానీ అనుకోలేం. ఆ విధంగా మిగిలిన ఆచారంగా వీటిని అర్థం చేసుకోవచ్చు. అందుకని కొన్ని సందర్భాల్లో పిల్లలు తల్లిపేరుతోనే చెలామణి అయ్యేవారు.

సమాజం పరిణామం పొందిన తర్వాత కుటుంబాలు ఏర్పడి, ఆస్తి కుటుంబపరమైనప్పుడు సంప్రదాయం తల్లకిందులయింది. కుటుంబాలేర్పడి నప్పుడు స్త్రీ ప్రాధాన్యం తగ్గి, పురుష ప్రాధాన్యం పెరిగింది. అప్పుడు ఆస్తి తండ్రి నుండి కొడుక్కు సంక్రమించటం ఆరంభమయింది. దాంతో సంతానానికి తల్లికన్నా తండ్రిని లెక్కపెట్టే సంప్రదాయమొచ్చింది. అంత వరకు శబ్దప్రమాణంగా వున్న పితృత్వానికి ప్రత్యక్ష ప్రమాణ ప్రతిపత్తి కల్పించడానికి మార్గాన్వేషణ ఆరంభమయింది.

వివాహాల్లో వున్న సగోత్రవివాహాలూ-సాముదాయక వివాహాలూ, దంపతీ వివాహాలదశ పోయి ఏకపత్నీ వివాహమన్నదశ అవతరించింది. పత్నుల సంఖ్య ఎంతున్నా వారసత్వ హక్కుండే పుత్రుణ్ణి కనే హక్కు ఒక్కదానికే. ఆమే "ఏకపత్ని". మిగిలినవాళ్ళందరూ ఉపపత్నులు. వారి సంతానానికి ఆస్తిహక్కు లేదు. అందువల్ల వారికి "దాయాద" అధికారం తప్ప "దాయమూలాల"మీద హక్కుండేది కాదు.

దీనికి ఉదాహరణగా రామాయణగాథనే తీసుకోవచ్చు. దశరథునకు నలుగురు ప్రధాన మహిళలు. అప్రధానులు చాలామంది వున్నట్టు రామాయణమే చెపుతుంది. వీరిలో మన నిర్వచనం ప్రకారం కౌసల్య ఏకపత్ని. ఆమె కొడుకు రాముడికే దాయమూలంపై

అధికారం. అంటే రాజ్యాధికారం. ఇది తెల్సుకున్న కైక ఎదురుతిరిగింది. దశరథుడు అంగీకరించక తప్పలేదు. కైక ఏకపత్ని అయి భరతుడికి దాయమూలాధికారం కట్టబెట్టాలనుకుంది. భరతుడు అంగీకరించక - రామ (రాజ) ప్రతినిధిగానే ఉండాలని నిర్ణయించుకోవడంతో కైక పథకం తల్లకిందులయింది. ఇలాగే సత్యవతీ శంతనుల కథనూ, శకుంతలా దుష్యంతుల కథనూ అర్థం చేసుకోవచ్చు.

అలాంటివారసుణ్ణి కనాలి కనకనే ఆ పత్నికి పరపురుష సంపర్కం కాకుండా సాధ్యమయినంతవరకూ బందోబస్తు చేసేవారు. మన దేశంలో లేమందక, కౌటిల్య, బృహస్పతి, శుక్రాది రాజనీతిగ్రంథాల్లో అంతఃపుర రక్షణకిచ్చిన ప్రాధాన్యం దీన్నే బలపరుస్తుంది. ఈ అంతఃపుర రక్షణలో కంచుకి లాంటి పాలకులు, బోనులూ, రక్షణద్వారాలూ వంటి అనేకానేక పద్ధతులను ఈ శాస్త్రవేత్తలు సూచించారు.

ఈ సంప్రదాయం అంతఃపుర రక్షణ అవసరమనుకున్న ప్రతి ప్రాచీన నాగరికతలోనూ- బాబిలోనియా, సుమేరియా, గ్రీకు, రోము – ఆధునికంగా ఉండే మధ్యయుగాల జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లాండులలో బహుళ ప్రచారంలో వుండేది. ఇలాంటి సంప్రదాయ రక్షణకే "ఇనపకచ్చడ"మని ప్రపంచచరిత్ర తెల్పుతుంది.

మనుచరిత్రలోని ఈ పద్యపాదం ఆనాటి ఋషులు తమ అస్ఖలిత బ్రహ్మచర్య ప్రతిపత్తి నిరూపణకోసం ఉపయోగించేవారేకానీ ఆడవాళ్ళ కోసం ఉపయోగించిన దాని వెనకవున్న ఆశయంతో మాత్రంకాదు. (దీనికి విప్రతిప్రత్తిగా తాతాజీ కొంత ఊహించారు.) అదీకాక వ్యంగ్యంగా ఎత్తిపొడవటం కూడా దీని ఉద్దేశం.

తాతాజీ పరిశీలనా శక్తికీ - హేతువాద అన్వయానికీ - ఒకకొత్త సృష్టితో పాత ఆచారాలు ఎలా మనకు తెలియకుండానే మనవెంట వస్తుంటాయో వివరించటానికీ ఈ ఇనుపకచ్చడాలు పాఠకుల ముంజేతికంకణాలు. పదునైన ఆలోచనాంశాలు.

—ఏటుకూరి ప్రసాద్

## కల్పనా కాదు, కాకరకాయా కాదు

# కడిగి వడపోసిన సత్యం

ఒక్కొక్క కవిచేసుకున్న అదృష్టం అలా వుంటుంది. అల్లసాని పెద్దన్నగారు "అచట పుట్టిన చిగురుకొమ్మైన చేవ" అని వ్రాశారట. ఆహాహా! ఎంత గంభీరమైన అలంకారం! ఏమి అమోఘమైన ఊహ! అని ఆకాశానికి ఎత్తివేశారు. ఎవరో ఒక మహానుభావుడు లేచి, అయ్యా, అది చిగురుకొమ్మ కాదు - చిగిరి చెట్టు కొమ్మ, చిగిరికి చేవుంటుందా అని అక్కడ జనసామాన్యం వాడుతుంటారు. మన బొప్పాయి, మునగ మొదలయిన చెట్లవంటిదే ఇదొక చెట్టు అని ప్రకటించారు. ఆహా! అలాగా అని నోళ్ళు తెరిచాము.

ఇలాంటిదే మరొకచోట కనిపించింది పెద్దన్నలో. వరూధిని ప్రవరాఖ్యుడిని తిప్పడానికి చూస్తూ,

*స్వారాజ్యమేలంగ నీరైరె సురహ*
*ల్యాజారుడయిన జంభాసురారి*

*వారికంటెను నీ మహత్వంబు ఘనమే?*
*పవన పర్ణాంబు భక్షులై నవసి, యినుప*
*కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల*
*తామరసనేత్ర లిండ్ల బందాలుగారె!*

అని అన్నాడు. ఆహా! ఏమిటి ఈ ఊహాచాతురి! ఇనుపకచ్చడాల్! ఏమి ఇంద్రియ నిరోధన సాధనం! ఎట్లా వూహించగలిగాడో ఈ పెద్దన! అని ఆశ్చర్యంలో మునిగిపోయాము.

మునులు ఎవరైనా ఈ ఇనుపకచ్చడాల్ కట్టుకొనేవారా? ఎవరు సప్లయి చేస్తుండేవారు? అవి ఎలా వుండేవి?

ముని అయితేనే ఈ ఇనపకచ్చ కట్టాలా? ఇతరులెవరయినా కట్టవచ్చునా? ఏదయినా 'మొనాపాలీ' వుండేదా? ఇతరులు కడితే ఎందుకు కట్టేవారు?

ఈ గోల అంతా పురుషులకేనా? స్త్రీలకు కూడా ఇటువంటి నిరోధన సాధనాలు ఏమయినా వున్నాయా? వాళ్ళకు అక్కరలేదంటారా?

ఆలోచించేవాడికి అన్నీ ప్రశ్నలే అంటారు. ఇలాంటి ప్రశ్నలకు అడ్డు ఏమిటి?

... ... ... ... ... ... ... ... ...

నిజం చెప్పాలంటే, ఇనుపకచ్చడం అన్నది కల్పనా కాదూ. కాకరకాయా కాదు. కడిగివడపోసిన సత్యం. ఇనుపకచ్చడాలుండేవి. ఇప్పుడుగూడా అవి వుంటే వుండవచ్చును. మానవ స్వభావం మారకుండా వుంటే, ఈ కచ్చడాలకు కావలసినంత అవకాశం ఎప్పుడయినా వుండవలసిందే. ఈ ఇనుపకచ్చడాలు ఒక్క పురుషులకే కాదు, స్త్రీలకు కూడా వుండేవి.

ఎవరికి ఎలాంటి కచ్చడాలుండేవో, ఎందుకుండేవో, ఎలా వుండేవో, ఇప్పుడు వాటి గుర్తులు ఏవయినా వున్నవో తెలుసుకోవాలీ అంటే, మానవ చరిత్రను మళ్ళీ ఒకసారి పరకాయించి చూడాలి. మొదటి పుటలు తిరగవెయ్యాలి.

పాఠక మహాశయులు "ఊ; కానీ" అంటే చాలు. నేను తిప్పి చెప్తాను.

* * *

మనిషీ ఒక జంతువే. ఇలాంటివి ఎన్నో జంతువులు వున్నాయి సృష్టిలో. ఏ జంతువు ప్రత్యేకత ఆ జంతువుకుంటుంది. సింహం మొదలు

చీడపురుగుదాకా ఏదో ఒక ప్రత్యేక గుణం లేని జంతువే లేదు.

కాని అన్ని జంతువులకూ కొన్ని సమాన గుణాలున్నాయి. అవి జాతికీ జీవనానికీ ముఖ్యమైనవి. అవి లేకపోతే జంతువూ చస్తుంది: జాతీ నశిస్తుంది. ఆ గుణాలున్నాయి కాబట్టే సృష్టి స్థితిలయాలకు అవకాశం వుంది. లేకపోతే సృష్టి అంతా ఈసరికి ఎప్పుడో అంతమయి వుండవలసిందే.

ఆహారమూ నిద్రా ఈ సమానగుణాలలోనివే. ఈ గుణాలు, వీటి అవశ్యకత లేని జంతువులు లేవు. అలాంటి గుణమే సంగమం. మిథునం అంటే జంట; దీనికార్యం కాబట్టి మైథునం అంటారు. ఈ సర్వ జంతుసమాన గుణాన్ని, ఆహారవాంఛ ఎంత స్వాభావికమో, నిద్రించాలన్న కోరిక ఎంత ప్రకృతి సిద్ధమో, సంగమవాంఛ అంత అవశ్యకమయినది.

ఈ వాంఛ పుట్టటానికి వేరే కారణం అక్కరలేదు. ఏలాంటి శిక్షణ వద్దు. చదువు సాముల పనిలేదు. జీవితమే ఆ కోరికను కలిగిస్తుంది. ప్రకృతే దానిని ప్రేరేపిస్తుంది.

ఆహారవాంఛ ఎంత బలమో వేరే చెప్పనక్కరలేదు. నాగరికత కలవారయినా చచ్చిపడి వున్న గుర్రాల మాంసం పచ్చిదే తిన్నారు. మగని కళేబరం మీద ఎక్కి నిక్కి చెట్టున ఉన్న కాయ కోసి తిని ఆకలి తీర్చుకున్న పతివ్రతలున్నారు. తోడివారి శవాలనే తిండిగా చేసుకొని ఎప్పుడు బయటపడతామా అని దినాలు గడిపిన శూరులున్నారు, ఆకలి చేసిన పని ఎంతో విశేషించి చెప్పనక్కరలేదు.

మైథునవాంఛ గూడ అట్లాంటిదే. దాని విసురును ఆపుకోవడం కష్టం. అందుచేతనే దాని బలాన్ని మహాకవులు వర్ణించారు. మన పురాణాలన్నీ దాని ప్రాబల్యాన్నే ప్రకటిస్తున్నాయి. మన ఋషుల చరిత్రలు దానినే ఉద్ఘాటిస్తున్నాయి.

*"తేషాం ఇంద్రియ నిగ్రహం యదిభవేత్*
*వింధ్యః ప్లవేత్ సాగరే"*

అన్నాడు ఒక మహా అనుభవశాలి. ఆకూ అలమూ తింటూ కాలం గడుపుతుండేవారు విశ్వామిత్ర పరాశర ప్రభృతులు మహాఋషులు. వారి పనేమయింది? ఈ సంగమ వాంఛకు జోహారు చేయక తప్పింది కాదు. అవునుకదా, అన్నమూ, పాలూ, నెయ్యీ తింటూ పెరిగిన సాధారణ మానవుల సంగతేమిటి? వీళ్ళలో ఇంద్రియనిగ్రహం వుంటే వింధ్యపర్వతం సముద్రంలో జీలుగు బెండులాగా తేలక పోతుందా? అని అన్నాడు భర్తృహరి! అంత బలం ఈ మైథునవాంఛకుంది.

ఏదో మాటవాసికి చెప్పాను గాని, ఈ వాంఛకున్న అమోఘబలం ఎరగనివారెవరు? దీనిని నిగ్రహించగలనని గట్టిగా చెప్పగల ధీరుడెవడు?

ఇంతకూ నిగ్రహించవలసిన ఆవశ్యకత ఏమి వచ్చింది? సవ్యమూ, సహజమూ కదా ఈ వాంఛ. ఆహారవాంఛను నిగ్రహించడానికి ప్రయత్నం ఏ జంతువయినా చేసిందా? ఇంద్రియ నిగ్రహం కోసం తాపత్రయ పడిన జంతువు సృష్టిలో వుందా? మనుష్యులలో అలాంటి ప్రయత్నం ఉందంటే-ఎక్కడో ఏదో పెద్దలోపం జరిగిందన్న మాట. మనుష్యులు ప్రకృతికి విరుద్ధంగా నడుస్తున్నారన్న మాట. వీరి జీవనం స్వభావానికి వ్యతిరేకంగా వుందని తేలిపోతుంది.

అదే జరిగింది మానవులలో. ఇదంతా మా తెలివితేటలవల్ల వచ్చిందని సంతోషిస్తే సంతోషించవచ్చు. దుష్టచింత వల్లనే ఈ దోషం సంక్రమించిందంటే అనవచ్చు. రెండింటికీ ఉన్నాయి ప్రమాణాలూ, దృష్టాంతరాలూను. దీనివల్ల మనుష్యుడు ప్రకృతిని అతిక్రమించాడని అనండి; లేదా, పతితుడై పోయాడని అయినా అనుకోండి.

ప్రకృతికి విరుద్ధంగా ఉండడమే ఒక గొప్పతనం అన్న అభిప్రాయం ఈ మనుష్యులకు కలిగింది. జంతువులలాగా ఉండటం నీచంగా తోచింది. మన గొప్పతనం ఏమిటి అన్న ఊహ పొడగట్టింది. ప్రవాహానికి ఎదురుగా ఈదడమే ఒక ప్రజ్ఞ అని అనుకున్నారు. జంతువులకు భిన్నంగా ఉండడానికే ప్రయత్నం చేశారు. దానితోనే అన్ని విధాల అగచాట్లకు

పొలయినారు. స్వభావసిద్ధమైన బ్రతుకు చచ్చింది. కపటమూ, మాయా ప్రకోపించింది. అసహజమైన జీవనం సంప్రాప్తించింది. ఇదే ఒక సౌభాగ్యం అని ఆనందిస్తున్నాము. నిగ్రహానికి స్వశక్తితో ప్రయత్నించారు. చాలింది కాదు.

దెబ్బ మీద దెబ్బ తినకతప్పింది కాదు. ప్రకృతీ నీకు ఇదిగో ఒక్క నమస్కారము అని, చేతులు జోడించక తీరింది కాదు.

గత్యంతరం లేదు. బాహ్య పరికరాలు కూర్చుకోవలసి వచ్చింది. ఇతర సాధనాలు వెదకవలసి వచ్చింది. ఈ పాట్లు పడలేక నపుంసకత్వాన్ని సంపాదించుకొనేవారు. కోరికోరి నపుంసకులయి గౌరవస్థానాలు అలంకరించేవారు. కదలడానికి వీలు లేకుండా ముండ్ల సెజ్జల మీద నివాసం ఏర్పరచుకొనేవారు. అన్ని విధాల భీభత్స రూపాలు ధరించేవారు. ఇంకా చాలింది కాదు. ఈ ఇనుపకచ్చడాలకు తయారయారు.

మతం కోసమని కొందరు; మహత్వం కోసం అని కొందరు ఇంద్రియ నిగ్రహానికి దిగారు. ఇదంతా తమంతటతామే తెచ్చిపెట్టుకొన్న గోల; స్వయంకృతాపరాధం—కాదు కాదు, నిగ్రహం, నిరోధం.

ఇంకొకరకం గూడా వుంది. అది ఇతరులు కలిగించిన నిగ్రహం: పైవారు కట్టించిన ఇనుపకచ్చడాల్ ఒక మనిషికి ఇంకొకరు ఇలా ఇనుపకచ్చడం కట్టించటం ఏమిటి? అసంభవం! అన్నట్టు కనబడుతుంది. ఒక వ్యక్తి ఇంద్రియనిగ్రహంతో ఇంకొక వ్యక్తికి ఏమిపని అన్నట్టు తోస్తుంది. కాని, కొంచెం ఆలోచిస్తే ఇందులో అసందర్భం ఏమీ లేదు.

లేగదూడకు నోరు కడుతున్నాం కామూ? నూర్పులలో ఎడ్ల ముట్టెలకు చిక్కాలు తగిల్చినామా లేదా? పనిచేయవలసిన గొడ్లకూ గుఱ్ఱాలకూ ఇంద్రియనిగ్రహం ఎంత చమత్కారంగా కలిగించాం చూడండి.

ఇందులో తప్పున్నదా? అనుభవం అనమేమి? అనము. ఎందుచేతనంటే, ఆ లేగదూడ మన సొత్తు; అంటే మనం పాలు తాగమన్నప్పుడే పాలు తాగాలి. ఆ ఎడ్లు మనవి; వాటిని మన ఇష్టంవచ్చినట్లు ఉపయోగించుకుంటాం. మన ఆస్థి కాబట్టే ఇతరుల ఉపయోగానికి విడిచిపెట్టం. అంతే కాదు, వాటి స్వసౌఖ్యం గూడా ఆలోచించం. ఈ ఇంద్రియనిగ్రహం వాటికి కావాలా వద్దా అన్న చింతే మనకుండదు. ఆస్థిమీద మనకున్న హక్కు చెలాయిస్తాము.

ఆస్తీ, హక్కూ అన్నవి ఎప్పుడూ అలాంటివే. ఎక్కడా అలా ఉండవలసినవే. పశువుల విషయమైనా అంతే, మనుష్యుల విషయమైనా అంతే. ధర్మం ధర్మమే, మారదు.

ఒక ఆడమనిషి ఆస్తిలో ఒక మగవాడున్నాడనుకోండి. ఆ ఆడమనిషి ఏమి చేస్తుంది? ఆ మగవాడిని తాను తన ఇష్టంవచ్చిన విధంగా తనకిష్టం కలిగినప్పుడల్లా ఉపయోగించుకుంటుంది. తన సంతోషానికీ, సంతృప్తికీ వాడిని వినియోగించు కుంటుంది. వాడి కష్టసుఖాలు తనకు ప్రధానం కావు.

అంతేకాదు; ఈ మగవాడిని ఇంకొకరి ఉపయోగానికి విడిచి పెట్టదు. ఇలాంటి సంతోషంగాని, ఇలాంటి సంతృప్తిగాని, వీడి ద్వారా ఇతరులు పొందడానికి వీలులేకుండా చేస్తుంది. ఏమయినా వెంకెతనం చేస్తే కాలు చెయ్యి విరిచి కట్టిపడవేస్తుంది.

రాబిన్సన్ క్రూసో ఏమిచేశాడు? కావలసినప్పుడు దొరుకుతుందో దొరకదో అని తన మేక కాళ్ళు విరగగొట్టాడు. ఆస్థిలో ఉన్న అధికారం అది: హక్కులో ఉన్న హజం అది.

అలాగనే, ఒక మగవాడికి ఒక స్త్రీ ఆస్తిగా దొరికిందనుకోండి. వీడుమాత్రం ముద్దిస్తాడా? తన హక్కు సర్వవిధాలా చెలాయించక ఊరుకుంటాడా? ఆ స్త్రీని తన ఇష్టం వచ్చినట్టు నడిపిస్తాడు. తానే

ఉపయోగించుకుంటాడు. పైవాడికి ఉపయోగ పడకుండా చూస్తాడు. ఇంకా ఏదయినా అట్టే ఇట్టే అంటే-ఏముంది? గట్టిగా నాలుగు తంతాడు; కొట్లో పెట్టి తాళం వేస్తాడు.

అవును: నిజం ఇది 1940వ సంవత్సరం, నాగరికమైన రోజులు. మానవస్వభావం గత ఏడెనిమిది వేల సంవత్సరాలనుంచి తెలివిమీరింది. సభ్యత్వం అలవరచుకుంది. అయినా, ఈ 1940లో భార్యలను భర్తలు పెడుతున్న పాట్లు తక్కువ లేదుకదా! మాటలాడితే "మారోమేఖ్" అన్న భర్తలున్నారు. ఇట్టే అంటే కొట్టి చంపేవారున్నారు. అంతా అయిన తరువాత పోతూపోతూ ఆడదాన్ని ఒక గదిలో పెట్టి తలుపు తాళం వేసుకుపోయే ఉద్యోగులున్నారు. అయ్యగారు ఆఫీసునుంచి వచ్చిన తరువాతనే అమ్మగారికి విముక్తి. పరాయి మనిషితో మాట్లాడినంత మాత్రాన్న పాపిష్టిదానా అని పడతిట్టిన పెద్దమనుష్యులున్నారు.

ఈ నాజూకు రోజులలోనే ఇలా వుంది కదా! పూర్వం ఎలా వుండేదో కొంచెం ఆలోచించండి. అప్పుడు ఈ హక్కును ఎంత నిర్దాక్షిణ్యంగా ఉపయోగించి వుంటారో కొంచెం ఊహించండి. ఆస్తి అంటే ఎంత అధికారం చెలాయించేవారో పోల్చుకోండి. అందులోనూ పురుషుడికి స్త్రీ గాని, స్త్రీకి పురుషుడు గాని సాధారణమైన ఆస్తి అనగలమా? అపూర్వమైన ఆస్తి. అందుకే అసాధారణమైన బందోబస్తు. పైవారు ఇరుపొంతలా చేరకూడదు. ఇతరుల ఈగ అయినా ఈ ఆస్తి మీద వాలకూడదు. మగవాడయినా అంతే. ఆడదయినా అంతే.

పక్షులలోను గూడా ఈ గుణం కనబడుతుంది. ఆడపక్షి గుడ్లు పెట్టి పిల్లలని చేస్తూ ఉంటే, మగపక్షి పారారలాయిస్తుంటుంది. ఇంకొక పిట్టని దగ్గరకు రానీయదు. హోరాహోరీగా పోరాడుతుంది. ప్రాణం అయినా కానదు ఇది. నాది, నా ఆస్తి అన్న జ్ఞానమే దానికి. ఇందులో ఒక్క విశేషం. ఆ సమయంలో ఈ ఆడపిట్టకు సంగమవాంఛ ఉండదు. అయినా ఇంకొక పక్షిని-తన జాతిదే అయినా-దగ్గరకు రానీయదు. ఇంకొక

పిట్ట ఎంత అపాయకరం కాకపోయినా, చేరనీయదు.

మనుష్యులకు అలాంటి బుద్ధి ఉందంటే తప్పా! ఈ బుద్ధి అంతకు పూర్వం ఉండేది: ఇప్పుడూ ఉంది. ఇకముందు గూడా ఉంటుంది.

చూడండి ఒక మోటు సామెత ఉంది. "ముద్ర ముద్రలాగే వుంది, ముగ్గురు బిడ్డలను కన్నది" అంటారు. ఇది గడుసుతనమో, దొంగతెలివో తెలియజేసే సామెత. ఈ ముద్ర ఏమిటో, ఎక్కడిదో ఊహించటం కష్టమయిన పనికాదు. సందర్భంబట్టి చూస్తే సులభంగా బోధపడుతుంది. ఆ ముద్ర ఒక ఆడదానికి వేసిన సంగమ నిరోధనం అని చెప్పాలి కదా! ఆయమ్మ సీలుసీలులాగే వుంచింది; చెయ్యవలసిన పనులన్నీ చేసేసింది. సంతానప్రాప్తిని పొందింది. ఎంత గడుసు మనిషో! పాపం! ముద్ర వేసినవాడు ఎంత మోసపోయాడు!

సంగమవాంఛ లేనప్పుడు పక్షులే అంత పకడ్బందీగా వున్నప్పుడు, ఆ వాంఛ వున్న మనుష్యుల విషయం ఎంత జాగ్రత్త పడాలి! ఎన్ని విధాల నిరోధనం సాధించడానికి ఉపాయాలు పన్నినా, లాభం లేకుండా పోతూవుండేది. ఉపాయానికి తగిన మాయోపాయం కనబడేది. మనుష్యులు విసిగిపోయారంటే తప్పా? ఆఖరికి "అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ" అని తాళాలు వెయ్యడం మొదలు పెట్టారు. మొదట అవయవాలకే రంధ్రాలు పొడిచి (తమ్మంట్లకు కన్నాలు పొడిచినట్లు) తాళం వేసేవారు. అది చాలా కష్టంగా వుందని మరికొన్నాళ్ళకు బెల్టులతో సహా ఇనపకచ్చలు కట్టించడం ఆరంభించారు.

## వీటి ఉపయోగం అంతా వివాహం అయిన తరువాతనే - ఆ రోజులలో అయినా

# భర్తలుండే భార్యలను మనువు పంపించేవారు

ఈ స్త్రీ నా సొత్తు, ఈ మగాడు నా ఆస్తి, అనుకొన్నప్పుడే కొంత హక్కూ కొంత అధికారమూ వస్తుంది. దాన్ని చెలాయించడానికే చూస్తాము.

ఈ అధికారం, ఈ హక్కు ఎప్పుడు కలిగింది? జంతువులలో గాని, పక్షులలో గాని ఇలాంటిది ఉందా? అంటే, ఉందనే చెప్పాలి. జంతువుల గర్భధారణ సమయములోనూ, పక్షులు గుడ్లు పొదిగి పిల్లలు చేయించినప్పుడూ ఇలాంటి అధికారం కొంత కనబడుతుంటుంది. ఆ సమయాలలో మగపిట్ట మరొక పిట్టను తన వెంటి దగ్గరకు రానీయదు. పెద్దజాతి కోతులలో జంట కూడిన తరువాత ఈలాంటి అధికారమూ, హక్కూ కనబడుతుంటుంది.

అనేక అనాగరిక (ఇది మనం వారికి పెట్టిన పేరులెండి) జాతులలో ఈ హక్కు మొదటినుంచీ వచ్చినది కాదు. జత కూడిన తరువాతనో, పెళ్ళి అంటూ ఒకటి అయిన తరువాతనో కలుగుతుంది. నా సొత్తు ఇతరులు వినియోగించకూడదు అన్న బుద్ధి వివాహం తరువాతనే కనబడుతుంది.

ఈ జాతులలో పెళ్ళి కాకముందు విచ్చలవిడిగా-అంటే స్వేచ్ఛగా తిరుగవచ్చును. స్త్రీ గాని, పురుషుడుగాని, అంతేగాదు కొన్ని జాతులలో అలా స్వేచ్ఛగా తిరగాలి విధిగా. అప్పుడు స్త్రీకి ఒక్క పురుషుడు అన్న నియమం లేదు. ఎవ్వరికీ ఈ ప్రవర్తన కోపకారణం కాదు.

ఈ నియమం అంతా పెళ్ళి జరిగిన తరువాతనుంచే. పెళ్ళి అయిన తరువాత పరపురుష సాంగత్యం చెయ్యరాదు. అనగా పతివ్రతా ధర్మం పాటించాలి. వివాహానంతరం ఉన్న పట్టుదల వివాహానికి పూర్వం లేదు. ఆ రోజులలో స్వైరవిహారం చేస్తూ ఉండడం బాగా కళ్ళారా చూచిన వాడు గూడా, పెళ్ళి అన్న రెండక్షరాలూ జరగగానే క్రొక్కి కూర్చుంటాడు. నేనే తప్ప మరెవ్వడూ లేడు అంటాడు మగాడు. ఆడవారి అధికారం ఉన్న దేశాలలో మగవాడిని గూడా ఇలాగనే ఏకపత్నీవ్రతానికి సంకెళ్ళు వేస్తారు. అక్కడి పాతివ్రత్యమూ, ఇక్కడి పాత్నీవ్రత్యమూ చాల గొప్ప గుణాలని "తాటాకులలో" వ్రాస్తారు. ధర్మశాస్త్రాలకు ఎక్కిస్తారు. అక్కడ పురుషులు ఎంత అధర్మంగా ప్రవర్తించినా తప్పు లేదు. ఇక్కడ స్త్రీలు ఎంత బాహాటంగా తిరిగినా దోషం ఉండదు.

పెళ్ళి ముందు అలా ఊరుకోవడం ఎందుకు? పెళ్ళయేసరికి ఇంత బిర్రు బిగిసిపోవటం ఎందుకు? కేవలం తెలివి తక్కువా? కాక, ఏదయినా రహస్యం ఉందా అని ఆలోచిస్తే; కొంత బలమైన కారణం ఉన్నట్లే కనబడుతుంది. మానవస్వభావంలో ఉన్న వినోదాభిలాష ఉండనే ఉంది. చక్కగ సంతోష పెట్టిన ఆడది దొరికింది. ఇంకా దానితోనే ఉండాలి. ఇలా చాలా కాలం ఉండాలి అన్న ఆశ కలుగుతే ఏంచేస్తాడు? ఎలాగో ఒకలాగ ఇది నాది అనిపించుకుంటాడు. అలా అనిపించుకున్న తరువాత మరెవ్వరిదీ కాదు అని శాసిస్తాడు.

అంతేకాదు. వంశమర్యాద అంటూ ఒకటి ఉందికదా. తన వంశం, తన వంశగుణాలు, తన వంశగౌరవం ఇలాంటివి అనాగరిక దినాలలో చాల ఎక్కువగా వుండేవి. ఆ వంశం పవిత్రంగా-వాళ్ళ సిద్ధాంతాల ప్రకారమే అవి-ఉండేటట్టు చూడాలి. కాబట్టే, ఇతర బీజం తమ క్షేత్రాలలో పడనీయకుండా చూస్తారు. అలా చెయ్యడానికి ఎలాంటి విధానాన్నయినా అవలంబిస్తారు.

పాతివ్రత్యం అంటూ ఇంత ప్రాకులాడేవారా! ఇందులో ఒక చిత్రం – అతిథి ఎవడయినా ఇంటికి వచ్చాడంటే ఈ కట్టడి అంతా ఎగిరి పోయేది.

ఇనపకచ్చలలో ఉంచిన ఈ ఇల్లాలిని కూడా ఆ అతిధికి అప్పగించేవారు. అలా చెయ్యకుండా తన ఆవిడ పాతివ్రత్యం కాపాడుకొనేవాడిని పరమ పాపాత్ముడుగా చూసేవారు. అతిధిపూజ ఆ రోజులలో పాతివ్రత్యానికి భంగం కలిగించేది కాదు. అతిధి సేవకు వెళ్ళివచ్చిన ఆ ఆడదానికీ, ఆ సేవకు పంపించిన ఆ మగవాడికీ ఇద్దరికీ ఉభయతారకమే.

ఇంత అవస్థ పడ్డాడు: పెళ్ళి అంటూ చేసుకున్నాడు; దానికి పాతివ్రత్యం నేర్పాడు: ఇనపసంకెళ్ళు వేసాడు; ఎందుకు? వంశం పవిత్రతను నిలపడానికి అన్నాడు. బాగానేఉంది. వీడికి పిల్లలు కలగకపోతే ఏంగతి? వంశం అంతరించి పోవలసిందేనా? లేదు. ధర్మశాస్త్రం తలకాస్తుంది. ఇలాంటి అవస్థ వచ్చినప్పుడు ఈ మగవాడు తన పతివ్రతను ఇంకొకని దగ్గరకు పంపవచ్చును-భోగాల కోసం కాదు, వినోదాల కోసం కాదు-గర్భవతి అయి వచ్చి, తన మగనికి ఒక పుత్రుణ్ణి ఇవ్వడానికి: ఆ రూపంగా వంశం నిలబెట్టడానికి. అలా భార్యను పంపిన వాడు వంశం నిలబెట్టడానికి ఇంత ప్రయత్నం చేశాడు కదా అని పితృదేవతలు – అటు ఏడుతరాలు ఇటు ఏడుతరాల వరకు-ధన్యవాదాలూ, పుష్పవర్షాలూ కురిపిస్తారు. ఆ ఆడదానిని మహా పతివ్రతల లిస్టులోనికి ఎక్కించి కథలూ, పాటలూ, కావ్యాలూ అల్లుతారు.

అంతేకాదు. ఒక వంశం వాడుంటాడు. పెళ్ళి దాని పీకులాటా అక్కరలేదు వాడికి. "ఏక్ నిరంజన్" అన్నట్టు ఉండాలని వాడికి అభిలాష. అలాగనే ఉంటాడు. ఇంతలో అయ్యో! నా వంశమే అన్న ఊహ ఒక్కనాడు హఠాత్తుగా కలుగుతుంది. ఒక కొడుకు పుడితే చాలును అని తోస్తుంది. గబగబా పొరుగు గృహస్థు ఇంటికివెళ్ళి "నీ భార్యను నాకు ఎరువు ఇస్తావా రెండు సంవత్సరాలు? ఒక కొడుకును కన్న తరవాత నీదగ్గరికి పంపించి వేస్తాను" అని అంటాడు. ఒక వంశాన్ని నిలబెట్టే పుణ్యం కలుగుతుంది కదా అని ఆ గృహస్థూ పంపుతాడు; ఆ ఇల్లాలూ అంగీకరించి ఎరవు కాపురానికి పోతుంది, కీర్తి పొందుతుంది.

ఇలాంటి చోటులలో ఇనపకచ్చడాలు వాదులు చేస్తారు. హక్కా,

అధికారాలూ అణచుకుంటారు.

## ఇనుపకచ్చడాల్ మరి రెండు

ఇనుపకచ్చడాలంటే ఏమో అనుకుంటాము. మానవబుద్ధికి అడ్డన్నది లేదు. ఎలాంటి కుతంత్రానికయినా ఒడిగడుతుంది. తన ప్రియుడినో, ప్రేయసినో; ఇంకొకరు ఉపయోగించరాదు. దీనికోసం తాళాలు వేశాము, పట్కాలతో ఇనపకవచాలు తయారు చేశాము. గోప్యాంగాలను భద్రపరిచాము; ఇతరులకు దుర్భేద్యంగా ఉండే కోటల్లాగా కాపాడాము. స్వప్రయోజన బుద్ధికి సింహాసనం కట్టాము.

ఇవి మరి రెండు ఇనపకచ్చడాలు. కల్పితాలు కావు నిజాలు. ప్రపంచంలో అక్కడక్కడ వస్తుప్రదర్శన శాలలలోనూ, మ్యూజియములలోనూ ఇప్పటికీ ఉన్నాయి. తూర్పు దేశాలలోనే కాదు; పాశ్చాత్య దేశాలలోనూ ఉన్నాయి. మనుష్యుల బుద్ధిసూక్ష్మతను - - కొంటెతనాన్ని అందామా?- వేయినోళ్ళతో చాటుతూ ఉన్నాయి. వీటి పుట్టుపూర్వోత్తరాలను గురించి వ్రాయడంగాని, చదవడంగాని చెడ్డపనికాదు. మానవ జీవితయాత్రలో ఇవి ఒక మజిలీవంటివి. నేటి నాగరకతకు మొదలు ఎలా ఉండేదో తెలుస్తుంది; రేపు ఎలాగా పరిణామం పొందవచ్చునో బోధపడుతుంది.

# కన్యాత్వం కాపాడడానికి తోలుకట్లు ఉంటే
# భార్యాత్వం రక్షించడానికి ఇనపకట్లు

ఇది నాది అని అనుకోవడంలో ఒక రుచి ఉందని మొదటనే మనవి చేశాను. నాకే వుండాలి మరొకడికి దీని వల్ల లాభం వుండకూడదు అన్న ఉద్దేశం, దాని అంతట అదే కలుగుతుంది. అదే స్వార్థం. ఈ స్వార్థంవల్ల మనిషి పశువును కూడా మించి పోతాడు. ఎటువంటి నీచమైన పనినైనా చేస్తాడు. ఎంత నికృష్టానికైనా దిగుతాడు.

ఈ స్వార్థం ఆకలిలోనూ, నిద్రలోనూ ఎలా విజృంభించిందో తెలిసిన విషయమే. ఈ యుద్ధాలూ, ఈ మారణకార్యాలూ అన్నీ ఆకలి కోసమే. ఇక కామం విషయంలో దీని సంగతి చెప్పవలసిందేముంది. హెలెన్ అన్న ఆడదాని కోసం ఘోరమైన ట్రోజన్ యుద్ధం జరిగింది. సీతయందు అభిలాష వల్ల రామరావణయుద్ధం చరిత్రలకెక్కింది. ఈ కామం కోసమే భీష్ముడు గురువుతో గుటగుటలు నెరపవలసి వచ్చింది; ఒకడి కామం వల్ల కలిగిన ఫలితమే భీష్ముడి బ్రహ్మచర్యం. అంత అమోఘమైనది ఈ కామం.

అంతా కావాలి, కొంతయినా ఇతరులకు ఉండకూడదు. స్త్రీ పురుషుడినీ, పురుషుడు స్త్రీని ఇలా కట్టి పడవేసేవారు; పడవేస్తున్నారు. ఇంతకు ముందు నేను చెప్పినట్లు పురుషాంగాలకు స్త్రీలు ఇనుపరింగులు కుట్టించేవారు; తాళాలు వేసేవారు. అలాగనే స్త్రీలకు పురుషులు కూడా ఇలాంటి బందోబస్తు చేసేవారు. ఈ ఆచారం పెండ్లో పెడాకులో అయిన తరువాతనే ఉండేది మొదట. పెళ్ళికి ముందు పిల్లలు ఏమిచేసినా తప్పు లేదన్న రోజులవి.

రానురాను అభిప్రాయాలు మారిపోయాయి. కన్యాత్వం చెడకుండా వుంటే మరీ మంచిదని అనుకున్నారు. ఆ ప్రకారమే శాసనం చేశారు.

"అక్షతయోని" అన్నమాట ఒక గౌరవం అయింది. దానితో

కూతురి కన్యాత్వం పోషించడం తల్లిదండ్రుల బాధ్యత అయింది. పెండ్లి అయినప్పుడు పెళ్ళికూతురు "అక్షతయోని" అని రుజువు చేయవలసి గూడా వచ్చేది. అలా రుజువు చెయ్యకపోతే గౌరవం తక్కువ. కులమర్యాదలకు లోపం.

ఇలా రుజువుచేయడం ఎంత కష్టమో ఆలోచిస్తే తెలుస్తుంది. ఈ రోజులలోనూ గూడా, ఇంత మెడికల్ జ్ఞానం ఎక్కువయినప్పుడు గూడా, ఇది రుజువు చేయలేకపోతున్నారు. ఎన్నో కోర్టులలో ఎన్నో కేసులు విచారణలకు వస్తున్నాయి. ఇక ఆ రోజుల సంగతి వేరే చెప్పాలా? చాలా కష్టపడేవారు. పెద్దలంతా ఆలోచనలు చేసేవారు. మలమూత్ర విసర్జనకు సందుండేటట్లు, కటి ప్రదేశం అంతా కట్టు కడితే బాగుంటుందనుకున్నారు. గుడ్డతోనో, తోలుతోనో, కట్టి కుట్టివేసేవారు. ఆ కట్టూ ఆ కెట్టూ మార్చడానికి వీలులేకుండా ఉండేది. పెండ్లి పక్కమీద భర్త ఒక కత్తితోనో, కత్తెరతోనో ఈ కట్లు నరికేవాడు. అలా నరకడంలో కొన్ని సమయాలలో రక్త దర్శనం గూడా వుండేదని చరిత్రలు ఘోషిస్తున్నాయి.

మరికొన్ని దేశాలలో ముసలి అమ్మలక్కలు ఒక పసరును కనిపెట్టారు. ఆ పసరు కటి ప్రదేశానికి పూతపూసేవారు. ఆ పూత అసాధారణమైన పూత. అలాంటి ఇలాంటి దేహశ్రమకు ఆ పూత చెక్కు చెదరదు. కామకార్యానికే అది చెదురుతుందట. శోభనంనాడు ఆ పూత సరిగా వుందా లేదా అని చూసుకొని, భర్త తన భార్య కన్యాత్వాన్ని నిర్ధారణ చేసుకుంటాడు. ఈ పసరు ఏమిటో, అది పూసే విధానం ఏమిటో రీసెర్చి పరిశోధకులు చెప్పితే ఇంకేముంది? ఈనాడు గూడా దానిని ఉపయోగించాలని ఎందరో ప్రభువులు బయలుదేరతారు. సందేహం లేదు. కాబట్టి ఆ అనాగరికులను తిట్టకండి. అదంతా మానవస్వభావం.

కన్యాత్వం కోసం ఇన్ని అగచాట్లు పడ్డవాడు, భార్యాత్వానికి భంగం రానిస్తాడా? నమ్మరాని మాట. చిన్నతనంలో గుడ్డకట్లూ, తోలుకట్లూ కడితే, పెళ్ళయిన తరువాత ఇనపకట్లు కడతాడు గానీ ఊరుకుంటాడా?

కన్యాత్వం చెడకుండా వుండడం తన మంచికోసమయితే, భార్యాత్వం తన కుటుంబానికంతటికీ మంచిది. తన వంశానికంతటికీ మంచిది. దాన్ని కాపాడుకోడమే పరమ ధర్మం అని నీతులు చెప్పారు. ఆడదానికీ మగవాడికీ ఆ అభిప్రాయాలే కలిగించారు. పురుషుల అధికారం వున్న దేశాలలో స్త్రీలకు ఇనుపకచ్చడాల్ కట్టించారు. స్త్రీలకు అధికారం వున్న దేశాలలో మగవారికే ఇవి తొడిగించారు.

ఉభయులూ ఒక్క చోటే ఉన్నప్పుడు అంతబాధ ఉండదు. భార్యాత్వంమీద అందరి కళ్ళూ ఉంటాయి, అంతేకాదు. కామదృష్టిని చూసే అవసరము అంతగా ఉండదు. కాని మగవాడు దూరప్రయాణానికి పోయినప్పుడో! ఏ ప్రమాదం కలుగుతుందో ఎవడు చెప్పగలడు? ఎటువంటి అనుమానాలు కలుగుతాయో ఎవతె ఊహించగలదు? కాబట్టి అలాంటప్పుడు తప్పకుండా, ఈ ఇనుపకచ్చలు ఉపయోగించవలసిందే. ఈ ఇనుపకచ్చను-మలమూత్ర విసర్జనకు అనుకూలంగా-ఉంచి, నడుముచుట్టూ పట్కా లాగా చుట్టి, దానికి ఒక తాళం వేసి, ఆ తాళంచెవి తనతో తీసుకుపోతాడు. తాళంచెవి తన దగ్గరున్నంతకాలమూ, తన పెళ్ళాం భార్యాత్వం సురక్షితంగా ఉందని అనుకుంటాడు.

ఈ ఆచారం శాసనాలలోని కెక్కడంతో ఊరుకోలేదు. శిలాప్రతిమలుగా గూడా వెలిసింది. ఒక మార్బిల్ స్టాట్యూ పెద్ద ప్రతిమ ఉంది. భర్త వ్యాపారానికి దూరదేశం బయలు వెళతాడు. భార్య చక్కగా, ఒక ఇనుప కచ్చడం బిగించుకుంటుంది. నడుము చుట్టూ ఆ ఇనపబెల్టు చుట్టింది. తాళం అమర్చింది. భర్తకు తాళంచెవి అందిస్తూ ఉంది. చలువరాతి విగ్రహంలో మాటలు వినబడవుగాని, ఆ భార్య "ఇదిగోనండీ, పాతివ్రత్య సంరక్షక బంధం. దీనికి బీగం బిగించి, ఆ తాళంచెవి మీతో తీసుకుపోండి. వంశగౌరవాన్నీ మీ మర్యాదనూ ఇలా కాపాడండి. మీరు తిరిగివచ్చి ఈ తాళం తీసినంతవరకూ నేను అసూర్యంపశ్యనై అన్యపురుషుడిని చూడకుండా వుంటాను. మీరు నిశ్చింతగా పోయిరండి" అని చెప్పే వుంటుంది. అభాగ్యులం కాబట్టి ఆ మాటలు వినబడలేదు.

## అతి లజ్జాకరంగా వుండవలసిన ఈ కచ్చడాలు
# ఆఖరుకు అలంకారాలలాగ పరిణమించాయి

స్త్రీ మీద పురుషుడికున్న హక్కు చెలాయించడానికి ఈ ఇనపకచ్చడాలు చాలా బాగా పనికివచ్చాయి. చేతిలో కలంవుంది చెరచెర వ్రాశారు సూత్రాలూ ధర్మపన్నాలూ. స్త్రీ పతివ్రతగా వుండాలన్నారు. పరపురుషుడిని చూడకూడదన్నారు. పాపం అన్నారు. నరకం అన్నారు. నరకం అంటే ఏమిటో బాగా తెలిసేటట్టు నరకబాధలను చిత్రాలుగా చూపించారు. కావ్యాలుగా వ్రాసి వినిపించారు.

అయినా ఇంకా అనుమానమే. మానవస్వభావం వుంది కదా, ఆహారాది సౌఖ్యాల రుచి ఒకటి వుంది కదా. శాస్త్రాలు అడ్డినా, సూత్రాలు ఆపినా, స్వభావాలు ఆగలేదు. చిల్లర చూపులు మానలేదు. మగవాడికి మహత్తు తగ్గిపోతూ వచ్చింది. మండిపోతుండేవాడు. మాటలతో తీరదురా ఈ మహాచిక్కు అని గ్రహించాడు. నిర్బంధన విధానానికి పూనుకున్నాడు. అంటే డిసిప్లినరీ చర్య ఆరంభించాడు. ఈ ఇనపకచ్చలు బిగించాడు.

ఆడది ఏదో తప్పు చేసిందన్న ఆగ్రహమే కాని, అందులో తానెంత వరకు కారణం అన్నమాట మన మగవాడికి లేదు. అందులో ఆనాటివాడికి అసలేలేదు. తాను విచ్చలవిడిగా తిరగొచ్చట. అది అంతా శృంగార రసమయ జీవనమట. అలా తిరిగేవాడు కులాసా పురుషుడట. సరసుడట. "వేశ్యాభుజంగా" అనడం ఒక బిరుదు నామం అట. అంటే అర్థం భోగంవాళ్ళకు విటుడు అని. ఇది ఒక ప్రఖ్యాతి పేరట. నలుగురితోనో పదుగురితోనో వ్యవహరించడం "మగసిరి" అట.

ఏమయ్యా, ఇలా చేయవచ్చునా అని అడిగితే, నవ్వు! విశ్వామిత్ర పరాశరులంతటివారే, ఆకూ అలమూ తిన్నవారే స్త్రీ ముఖం చూచి

మోహపరవశులయ్యారు. మహా తపస్సంతా, మదనతాపం చేసుకొని, పుణ్యం అంతా బుగ్గిలో కలిపి, ఆ స్త్రీలను కూడారు. మనం రాజాన్నాలు తినేవారం. పాలూ పెరుగూ నేయి భుజించేవారం.

శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుంజంతియే మానవాః

తేషా మింద్రియ నిగ్రహం యదిభవేత్ వింధ్యాప్లవేత్ సాగరే.

అటువంటి మనం తట్టుకోగలమా? వింధ్యపర్వతం సముద్రంలో తేలిపోవలసిందే కదా! అని కవిత్వం వెలిగిస్తారు. ఆ శాల్యన్నమే స్త్రీలుగూడా తింటారని తెలియదా! వారు తాగిన పాలకు ఈ గుణం ఉండదా! వారూ ఈలాంటి పనే చేస్తే తప్పా? దోషమా? అన్న దృష్టే ఉండదు. స్వార్థపరత్వం పెరిగిపోతే, సంగతులు సరిగా బోధపడవు.

దీనికి తోడు మరొకటి గూడా చేశాడు మానవుడు. తన ఇష్టం వచ్చినంతమందిని పెళ్ళి చేసుకోవచ్చునట. సంతానంకోసం అని అంటారేమో, అలాంటివారు చాలా తక్కువ. మొదటి పెళ్ళానికి అరడజను పిల్లలున్నా రెండో భార్యను చేసుకొన్న వారెందరు? ఇద్దరు భార్యలకూ చెరి పదిమంది పిల్లలున్నా మూడోదానికోసం మొగసాల ఎక్కేవారెందరు?

కారణాలున్నాయిలెండి. లేనికార్యం అంటూ ఏదయినా ప్రపంచంలో వుంది గనకనా! కాని, ఆ కాంతల గతేమిటి? ఈ మగరాజు రోజుకొక అంతఃపురంలో ఉంటాడు. తన కామానికి దారి చూచుకుంటాడు. తాను తిన్న పాలూ, పెరుగూ వినియోగంలో పెడతాడు. మరి ఆ రెండో భార్య? ఏమి చెయ్యాలి? ఇతడు తృష్ణ ఎలాగో ఒకలాగా తీర్చుకుంటే మరి దాని తృష్ణో? ఆ తృష్ణ తీర్చే ఉపాయం ఏదయినా చేయగలిగాడా? ఆమెకు సంతృప్తి కలిగించి తరువాత తన సంతృప్తి కోసం చూచాడా?

లేదు; ఆ స్త్రీ పాపం పై చూపు చూస్తుంది. దానికి మంట. అది

వ్యభిచారం అట. (తాను చేసిందంతా సరసం, మగసిరి సుమండీ) పాపం అట. ఇక దానిని తిట్టిన తిట్లు యిన్నీ అన్నా? స్త్రీ బుద్ధిః ప్రళయాంతకా అన్నారు. పడతి అంటే పాము అన్నారు; దూరంగా పారిపో అన్నారు; అగ్నికీల అన్నారు. అందరినీ మింగేస్తుందన్నారు. తిట్టారు; శపించారు. ఇనపకచ్చలు వేసి బీగాలు బిగించారు. దోషంచేసింది మగవాడు; దూషణ పొందినది ఆడది. అది మనవారి న్యాయం!

అనేకమంది స్త్రీలను ఉంచుకొనే అచారం ఉన్న దేశాలలోనే ఈ ఇనపకచ్చడాల ఉపయోగం ఎక్కువగా ఉండేది. ఈ ఇనపకచ్చడాల అచారం ఎక్కువగా ఉన్నప్పుడు అది లేకపోవడం ఒకలోపం అవుతుంది. దానికి ఒక అధిక్యం వస్తుంది. ఈ ఇనుపకచ్చలు చేయడంలో నిర్మాణ చాకచక్యం చూపించడం, కొత్త కొత్త రకాలు తయారుచేయడం, బుద్ధి కుశలత కనబరచడం అన్నీ వస్తాయి. ఇనపకచ్చలు అన్న విషయం ఒక కళ అవుతుంది.



ప్రక్క చూపిన కచ్చడం మీద చూడండి ఎంత నగిషీపని చూపించాడో! మలద్వారమూ మూత్ర ద్వారమూ ఎంత అందంగా ఉంచడానికి ప్రయత్నం చేశాడో! దీనిని బట్టి చూస్తే, పాపం! ఆ స్త్రీలు వీటిని నిరోధక యంత్రాలుగానూ, శత్రుమారణసాధనం గానూ భావించారంటారా? అలా అనగలమా?

లేదు, వీటిని గూడా అలంకారాలుగానే భావించారనడం మంచిది. భావ్యం. మజూరీ -- చేసేందుకు కూలి-ఎంత ఇచ్చారో. ఎంత సంతోషంతో ఈ ఇనపకచ్చడాలు ధరించేవారో! "చూచావా, మా అయన నాకు ఎంత చక్కని కచ్చడం చేయించాడో" అని ఎందరు అమ్మలు తమ స్నేహితులకు వీటిని చూపించేవారో.

ఈ కచ్చలు - మంచివి - లేనివారు "ఏమండీ, నాకు కచ్చడం

చెయ్యించి పెట్టారు కారు. యింకెన్నాళ్ళు ఈ దరిద్రపు బతుకు బతకటం; చూడండి. సుబ్బమ్మ పది వరహాలిచ్చి కచ్చడం చెయ్యించుకుంది; రామక్క పన్నెండు వరహాలిచ్చి చెయ్యించుకుంది. నా గతే ఇలా అఘోరిస్తూవుంది" అని ఎంత వేధించేవారో భర్తలను! వారెన్ని పాట్లుపడి డబ్బు సంగ్రహించి, ఈ కచ్చడాలు చేయించేవారో.

ఇదంతా హాస్యానికి చెప్పిన మాటలు కావు, నిజాలు. ఇప్పుడు చెయిన్ గొలుసులు, తళుకుల గాజులు చెయ్యించమని భార్యలు భర్తల ప్రాణాలు తీస్తున్నట్టే అప్పుడు ఈ కచ్చడాల కోసం ఆందోళన చేసేవారు. లుంగీ పాటర్ను పట్టుచీర కొనకుండా ఇప్పుడు మగవాడు పెళ్ళాం పోరు ఎలాగా మాన్పలేడో, అలాగే ఆ రోజులలో సరి క్రొత్తరకం కచ్చడం ఇచ్చినదాకా, మగని మర్యాద దక్కేది కాదు. అది లేకపోతే అవమానం. అమర్యాద, సిగ్గు, లజ్జ, అది అంత అవసరం.

ఈ పైని చూపించిన కచ్చడంలో మీదిభాగం (అనగా కటిముందు వుండవలసిన భాగం) ఇప్పటి మరుగుబిళ్ళలకు (సిగ్గుబిళ్ళలంటారు) పోలికగా వుంటుందో లేదో కొంచెం పరిశీలించి వుండండి.

## ఆ ఆచారశేషమే మన "మరుగుబిళ్లలు"

# ఈ కచ్చడాల నిర్మాణ విధానం

ఈ కచ్చడాలు ఆడవారికి ఒకవిధంగా నగలయినాయి. అందులోనూ ముఖ్యంగా ఉండ వలసిన నగలు. అదిలేకపోతే సిగ్గు. ఆ కచ్చడంలో ఒక ముక్కే ఇప్పటి మరుగుబిళ్ళ. ఆ పటానికీ, ఇప్పుడు వాడుకలో సర్వత్రా ఉన్న మరుగుబిళ్ళలకూ, ఎంతపోలిక ఉందో చూచినంత మాత్రాన తెలుస్తుంది. అదే ఆకారం; అదే చిత్ర రచన. ఆ ఆచారం పోయింది. దాని లాంఛనంగా ఇది మిగిలిపోయింది.

మరుగుబిళ్ళ లేకపోతే తప్పు. ఒక స్త్రీకి పుట్టిన ఆడుబిడ్డకు మరుగుబిళ్ల పుట్టింటివారు చేయించాలి. లేకపోతే అమ్మలక్కలు ఆడిపోస్తారు. "ఆపాటి మరుగుబిళ్ళ చేయించడానికి గూడా గతిలేకపోయిందా?" అని అంటారు. ఇది పెద్ద తిట్టు.

కొందరు ఈ వాదనను అంగీకరించరు. గోప్యాంగం కనబడకుండా ఈ ఉపాయం చేశారంటారు. దీన్ని సిగ్గుబిళ్ళన్నారు. కాని, ఈ వాదనను అంగీకరించరు తెలిసిన వారు. ఎవరికి సిగ్గు? ఆ చిన్నపిల్లకా? పయివారికా? చిన్న పిల్లకు సిగ్గు ఏమిటి?

ఇంక గోప్యాంగం కనబడకూడదన్న సంగతికి. ఆ పాటి గోప్యాంగం మగబిడ్డకు మాత్రం లేదూ? మగవాడికి ఒక బిళ్ళలాంటిది కట్టరేమి? చూచేవారికి సిగ్గువేస్తుందని అంటారేమిటో. అలా అయితే పిల్లవాడి గోప్యాంగం చూచిన స్త్రీలకు సిగ్గులేదని, ఆడపిల్లది చూస్తే పురుషులకు మాత్రం సిగ్గు కలుగుతుందని అనవలసి వస్తుంది. ఆ వాదన ఏమీ బాగుండదు.

దీనికన్నా మంచి సమాధానం ఒకటి ఉంది. అది గూడా పూర్వ కాలపు (అంటే అనాది కాలపు) నమ్మకాలను అనుసరించి ఉన్న

సమాధానమే. అదేమంటే-దిష్టిదోషం అన్నది ఒకటి ఉందనీ, ఆ చెడ్డ దిష్టి ఎవరికీ తగలకూడదనీ, అందులోనూ ముఖ్యంగా గోప్యాంగాలకు తగలకూడదని ఒక గట్టి నమ్మకం ఉండేది. అందుచేత ఇతరుల దిష్టి సరాసరి శరీరాల మీద పడకుండా ఉండేటట్టు చూచేవారు. దిష్టిదోషాన్ని మరేదయినా వస్తువుమీదకు తిప్పేవారు.

ఈ పద్ధతి ననుసరించే, ముఖాలమీద కాటుక చుక్కలు పెట్టడం, ధగధగ మెరిసే గాజుపూసలో, గవ్వలో లేక ఆభరణాలో ఉపయోగించడం వచ్చింది. ఇది ప్రపంచం అంతటా జరిగిన విషయం. అన్ని జాతులు పూర్వకాలం ఈ దిష్టి దోషాన్ని అంత జాగ్రత్తగా పాటించేవారు. ఇప్పటికీ ఈ నమ్మకం లేకపోలేదు.

ఈ దిష్టిదోష పరిహారంకోసం ఇలాంటి బిళ్ళలు ఉపయోగించేవారు అని చెప్పతారు. దీనికి దృష్టాంతంగా, మగపిల్లల మొలత్రాళ్ల చిన్నపాలకాయలవంటి వస్తువులు, లేక పొడుగాటి గజ్జెలు, కడతారు-బంగారాన్నో, వెండినో చేయించి. అంతకూ చాలనివారు కానుగకాయనో, నల్ల జీడిగింజనో, ఏదీ చిక్కకపోతే నల్లని పెద్దపూసనో మొలతాడుకి కడతారు అని చూపిస్తారు.

ఈ వాదన అంత సులభంగా కాదనలేము; కాని, ఇనుపకచ్చడాల ఇమిటేషన్ అన్న వాదనకు మాత్రం బలం ఎక్కువగా ఉందని చెప్పాలి. ఆకారాన్ని బట్టిచూస్తే, ఇదే నిజమయిన కారణంగా కనబడకమానదు. అంతేకాకుండా ఈ మరుగుబిళ్లను రావిఆకు లాగా చేస్తారు. అంతేకాదు, ఆ ఆకుమధ్యకు రెండుమూడు గీతలు నిడుపుగా ఉంచుతారు. అంతా పట్టిచూస్తే ఈ బిళ్ళల నిర్మాణమూ, ఆ కచ్చడాల నిర్మాణమూ ఒక్కచేతి మీదనే తయారయినట్టు కనబడతాయి.

అంతెందుకు? ఇలాంటి బిళ్ళనే మరొకదానిని వెనుక ప్రక్కకు కట్టి, ఈ రెండు బిళ్ళల కొనలనూ కొంచెంవంచి కలిపినట్టయితే, ఇప్పుడు పటంలో కనబడ్డ కచ్చడం అవుతుంది. అలా ఉండడానికే ఈ బిళ్ళల

చివరలు సన్నంగా చేశారు. ముందునుంచి వెనుకకు పోయినప్పుడు తొడలకు బాధ కలగకుండా ఈ భాగం సన్నంచేశారు.

తీసినప్పుడు, కట్టినప్పుడు సదుపాయంగా ఉండటానికి ఈ రెండు చివరలని ఒక కీలుతో "జాయింటు" చేసేవారు. "జాయింటు" పద్ధతి ఇష్టం లేదన్నవారు ఒక్క రేకులోనే ముందుబిళ్లా వెనుకబిళ్లా కొంచెం విశాలంగా చేసి మధ్యభాగాన్ని సన్నంగా చేసేవారు. ఇది ఒక్కముక్క "కచ్చడం", అతుకు ఉండదు. రేకు పల్చగా వుండడంచేత వంగుతుంది. మధ్యను సన్నంగా వుండడంచేత తొడలను ఒరుసుకొని బాధపెట్టదు.

ముందుబిళ్ళకు, వెనుకబిళ్ళకు ఉచితస్థలాలలో మూత్రవిసర్జనకు, మలవిసర్జనకు రంధ్రాలు ఉంచేవారు. ఈ బిళ్ళను బంధించడానికి, మొలతాడువలె సన్నని ఇనుప పట్కా ఒకటి చేసేవారు. ఈ పట్కా ఒక ముక్కగా ఉంటే, నడుముకు గుచ్చుకుంటుందని మూడు, నాలుగు ముక్కలను కీళ్ళతో సంధించి చేసేవారు. ఈ పట్కాను ముందు వెనుక బిళ్ళల తలలోనుంచి ఈడ్చి నడుముచుట్టూ తిప్పి, ఈ పట్కా రెండుకొనలనూ కలుపుతూ చిన్న బీగం వేసేవారు. అదీ ఇనుపకచ్చడం నిర్మాణ విధానం!

ఇంత సన్నాహం చేస్తేగాని ఇనపకచ్చడం తయారయేది కాదు. ఇంత పాతివ్రత్య సంరక్షక మహాసాధనం కనిపెట్టిన మహా మేధావి ఎవడో: ఏ దేశంవాడో: ఏ కాలంవాడో కదా.

## కచ్ఛడాల్ కట్టించిన సందడేకాని

# కానున్న ప్రమాదాలు కనబడవు

మరుగుబిళ్ళలకు దారితీసినవి ఈ కచ్ఛడాలే. ఈ మరుగుబిళ్ళలు ఎటువంటి అకారాలలో ఇప్పుడున్నా ఆ రోజులలో ఇవి రావిఆకు లాగా ఉండేవి. అదియే కచ్ఛడాలకు సరిఅయిన ఆకారము "పిప్పలచదము" అని ఆంధ్ర సంస్కృత కవులు వర్ణించినది. ఇదే ఫిగ్ లీఫ్ (Fig Leaf) అని జపానులో స్నానసమయాలలో ఉపయోగించినది ఇదే. ఈ రావి ఆకు ఆకారాలలో ఉన్న కచ్ఛడాలను బిగించి, ఇనుపరేకు ఒడ్డాణాలతో బంధించి విడిచిపెట్టేవారు స్త్రీలను. ఈవిధంగా వారి పాతివ్రత్యాన్ని భద్రపరిచేవారు.

శరీరానికి ఈ ఇనుపరేకులు ఒత్తుకొని బాధించకుండా ఉండడానికి ఒక ఉపాయం చేసేవారు. రేకులకు లోపలిభాగం-అంటే శరీరానికి తగిలి ఉండే భాగంలో-మెత్తని తోలుగాని, గుడ్డగాని అతికించేవారు. ధనమున్న వారు మరింత అందంగా ఉండి, బాధ అన్నదే లేకుండా వుండేటట్లు చేసేవారు.

ఇకను ఈ ఒడ్డాణాలను బిగించి తాళం వెయ్యడానికి, శిల్పులు తమ తెలివితేటలన్నిటినీ ఉపయోగించేవారు. ఎవరుగాని, ఎలాంటి మారుతాళంతోగాని, ఈ బీగాలను తెరవడానికి వీలులేకుండా ఉండేవిధంగా కొత్తకొత్త రకాల తాళాలు తయారుచేసేవారు.

ఇలాంటి అద్భుతమయిన తాళం చేయించాడట ఒకడు. భార్యకు ఈ కచ్ఛడం కట్టాడు. తాను ప్రయాణంమీద పోయాడు. దారిలో పెద్ద ప్రమాదం సంభవించింది. ప్రాణాలు కాచుకోవడమే కష్టమయింది. తనకున్న సర్వస్వం నష్టపోయాడు. ఈ కచ్ఛడం తాళం గూడా పోయింది. ఇంటికి తిరిగివచ్చాడు. పెళ్ళాం పతివ్రతగానే వుంది. వేసినతాళం వేసినట్టే వుంది. కాని- ఈ భర్త ఆ తాళం తీయడం ఎలాగ? ఆ

పతివ్రతతో కాపరం చేయడం ఎలాగ?

పాపం! ఏమీతోచింది కాదు. ఊరుకోడానికి వీలేలేదు. కాపరానికే నీళ్ళధార. ఇంత మహాప్రయత్నంతో కాపాడుకున్న తనభార్య సౌఖ్యం తనకు తప్పతుంది. బయటికి చెప్పతే నలుగురూ ఏమంటారు? ఇంత మంచి ఇల్లాలు మీద గూడా అనుమానం పడ్డాడా అంటారు. నిందలపాలయిపోతాడు. ఏదో రహస్యంగా ఏడుస్తామాంటే అరి నిర్భేద్యంగా ఉంది ఈ కచ్చడం!

శిల్పకారుడికయినా తెలియక తప్పదు. పాట్లుపడ్డాడు. ప్రయత్నించాడు. బద్దలు కొట్టడానికి ఏమేమో చేశాడు. వీలులేకపోయింది. తుట్టతుదకు ఒక విశ్వకర్మ వృద్ధుడిని పిలిచి సహాయం చెయ్యమన్నాడు. తాను చేసిన దోషానికి తగిన ప్రతిఫలం అనుభవించాడు.

అన్నిచోట్లా ఇంత సధర్మంగానే సాగుతుందా పాతివ్రత్య సంరక్షణం! ఇంకొకడు ఈ తాళంబిగించి యాత్రమీద పోయాడు. ఇంటిలోని ఇల్లాలికి ఒక యువకుడి మీద ప్రేమ. వాడిని పిలిచింది. ఈ కచ్చడం సంగతి తెలియజేసింది. ఆ యువకుడు ఒక శిల్పిని మంచి చేసుకున్నాడు. ఒక చక్కని మారుతాళం చెయ్యించాడు. ఎన్నాళ్ళనుంచో ఉవ్విళ్ళూరుతూ వున్న ఆ కాంత సౌఖ్యం అవిచ్ఛిన్నంగా అనుభవించాడు. భర్త వచ్చినప్పటికి ఆ ఇల్లాలు ఇనుపకచ్చడంతో సురక్షితంగానే వుంది. కచ్చడం, తాళం అన్నీ వేసినట్టే వుందిగాని, తన ఇల్లాలి శీలం మాత్రం మారిపోయింది. ఈ సంగతి ఎలా తెలుస్తుంది, ఆ భర్తకి పాపం!

ఇంకొక మహానుభావుడు ఇలాగనే కచ్చడం బిగించి వెళ్ళిపోయాడు. పాపం! ఆ ఇల్లాలు పరమసాధ్వి. ఆ కచ్చడాన్నే తన భర్తకంటే ఎక్కువగా పూజిస్తూ వుండేది. ఆ భర్త ఏదో ఓడ ప్రమాదం వల్ల మరణించాడో మాయమయిపోయినాడో తెలియదు.

ఈ కాంత ముసలి అయిపోయింది. భర్తకోసం చూచిచూచి వాచి పోయింది. రోగి అయింది. తుదకు చచ్చిపోయింది. కూడను తన

కచ్చడం తన శరీరం మీదనే వుండిపోయింది. తీసేవాడెవడు? ఎలాగ? ఆ ఇల్లాలు బొందెలో ప్రాణం వున్నంతవరకు ఆ కచ్చడాన్ని తీయనిస్తుందా?

ఆ దేశ ఆచరం ప్రకారం ఆమె శరీరాన్ని అలాగే పెట్టెలో పెట్టి పాతిపెట్టారు. కాంతతో కచ్చడంగూడా పాతేశారు. శరీరం శిధిలం అయిపోయింది. భూమిలో ఎముకలు మాత్రం నిలిచాయి. కంకాళ రూపంగా. కాని, ఈ కచ్చడం మాత్రం అవిచ్ఛిన్నంగా అలాగే వుంది భూగర్భంలో.

కొన్ని శతాబ్దాల తరువాత, ఆ స్థలం తవ్వినప్పుడు ఈ స్త్రీ కంకాళం అంతా కనబడ్డది. జాగ్రత్తగా ఆ ఎముకలు, ఆ పెట్టె అంతా చూడగా, అది ఒక స్త్రీ కంకాళం అనీ, ఈ ఇనుపకచ్చడంతోనే మరణించిందనీ అంతా బోధపడ్డది. ఈ కచ్చడం నేటికీ జాగ్రత్తపరచి వుంచారు.

## ఇహలోకం విడిచిపెట్టిన ఇల్లాలు చరిత్ర
## కచ్చడాల ఆచారానికి ప్రత్యక్ష ప్రమాణం

# పోచెంజర్ కచ్చడం



కొన్ని ఇనుపకచ్చడాళ్లను వర్ణించినాను. కొన్ని మ్యూజియములలో ఉన్న ఇనుప కచ్చడాళ్ల ఫోటోలను ఇచ్చినాను. వాటికీ మన ఆచారాలలో ఉన్న మరుగుబిళ్ళవంటి విషయాలకూ గల సంబంధం చెప్పాను. ఇతర దేశాలలో వున్న ఆచారాలు నిరూపించాను. వాటికి సంబంధించిన కథలు వ్రాశాను.

అయినా ఒక్క ప్రశ్న మాత్రం మిగులుతూనే వుంది. ఈ కచ్చడాల్ కట్టుకొని ఉండిన స్త్రీలని ఎవరయినా చూచారా? అది ప్రశ్న. ఇప్పటికీ కొందరు అవధూతలో సాధువులో మగవారు ఆ ఇనుప కచ్చడాలతో జీవిస్తున్నారని ఇంతకుముందే మనవి చేశాను.

ఆడువారు ఈ కచ్చడాలతో ఉండడం పురాతన విషయం. వాటితో ఉన్నవారిని చూడటానికిగాని, చూచినవారితో మనం మాటలాడటానికిగాని, రెండు మూడు శతాబ్దాలయిన తరువాత, ఇప్పుడు .మనకు అవకాశంలేదు.

గ్రంథస్థంగా ఉన్న విషయాలు తరువాత మనవి చేస్తాను. కాని, అదంతా శబ్ద ప్రమాణం అవుతుంది. పైని చెప్పిన విషయాలు అనుమాన ప్రమాణం. ప్రత్యక్ష ప్రమాణం కావాలంటారు. చక్షురక్షర సంయోగం కలుగుతేనే గాని నమ్మం అంటారు కదా:

దీనికి భాగ్యవశంగా ఒక్క విషయం వుంది.

మ్యూనిచ్ నగరంలో పాచింజర్‌గారి దగ్గర ఒక ఇనుపకచ్చడం వుంది. ఇది వారికి లభించిన విధం మొన్న చూచాయగా తెలియ జేశాను. దీనిలో గొప్ప విశేషం ఈ ప్రత్యక్ష ప్రమాణమే. కాబట్టి ఈ కచ్చడం గురించి కొంచెం వినిపిస్తాను.

ఆస్ట్రియాలో వుత్తరభాగాన్ని ఒక చర్చికి మరామత్తులు చేస్తూ తవ్వుతుండగా 1889వ సంవత్సరంలో ఈ కచ్చడం కనబడింది. ఎలాగంటే—

కొన్ని రాతిపలకలు తవ్వి ఎత్తుతుండగా భూగర్భంలో ఒక గోయిలాగా కనపడ్డది. బాగాచూస్తే అది చచ్చిన కళేబరాన్ని పాతిపెట్టడానికి చేసిన పెట్టె అని బోధపడ్డది. లోపల సత్తురేకులో ఆ పెట్టెయే కనబడ్డది.

ఆ సత్తురేకుపెట్టె తెరిచినప్పుడు పాచింజర్‌గారు అక్కడనే వున్నారు.

పెట్టె పైకప్పు పగులకొట్టగానే, చివికిపోయిన చెక్కపలకలు కనబడ్డాయి. వాటినీ మెల్లగా తొలగించగా మనుష్య శరీర అస్థిపంజరం బయటపడ్డది.

తలవెంట్రుకలు చక్కగా జడవేసి మలచివున్నాయి - నాటకాలలో స్త్రీ వేషాలు పెట్టుకొనే విగ్గులలాగా.

చక్కని వాడి పల్వరుస, చిత్ర విచిత్రంగా అల్లిన ఆ జడ అంతా చూస్తే, ఆ స్త్రీ మంచి యవ్వనంలోనే చనిపోయిందని అంగీకరించారు.

శరీరంమీద వున్న గుడ్డ మీద భాగం కొంచెం బాగానే వుందిగాని అడుగుభాగంలో అంతా మన్ను అయిపోయింది.

ఆ గుడ్డలు కొంచెం తొలగించి చూడగా, బోర ఎముకలు, కడుపు డొక్క కనపడ్డవి.

నడుముచుట్టు ఇనుపపట్కా లాంటిది కనిపించింది. ఇది

నాలుగయిదు ముక్కలు అతికిన బెల్టు. దీని ముందు భాగానికి తగిలి కాలిజోడు అట్టువంటి ఆకారంతో ఒక రేకు వుంది.

ఈ రేకును రెండు చిన్న తాళాలతో బెల్టుకు కలిపి వుంచారు. ఈ తాళాలు చాలా వరకు త్రుప్పుపట్టిపోయాయి. ఆ అస్తిపంజరం కింద భాగంలో, ఇలాంటిదే మరొక రేకు ముక్క తగిల్చి వుంది.

అది చూచి ఆ చర్చి అధికారి ఒకడు ఇది "ఇనుపకచ్చడం" అని దానిని మీదికి ఊడదీశాడు. పాచింజెర్‌గారు దానిని అడిగి భద్రంగా తమ బసకు తెచ్చి ఇప్పటికీ వుంచారు.

దాని పటమే ఈ వ్యాసంలోని చిత్రము. దీని కొలతలు గూడా వున్నాయి. ముందున్న రేకులో కోలని రంధ్రమున్ను, వెనుకరేకున పువ్వువంటి కన్నమున్ను, మూత్ర మలద్వారాలు. ఈ మూత్ర ద్వారములో లోపలి అంచులో ముండ్లు ముండ్లుగా వుంచారు. ఈ ప్రక్కను 21 ముండ్లు, ఆ ప్రక్కను 21 ముండ్లు, మొత్తం 42.

పాపం! ఏ ఇల్లాలో తన పాతివ్రత్యాన్ని ఇంత కట్టుదిట్టంగా కాపాడుకుంది! ఏ మహామహుడో తన ప్రేయసిపై తనకున్న అధికారాన్నీ హక్కునూ ఇంత ఘోరంగా చెలాయించాడు.

# వీటిని కనిపెట్టినవారు తూర్పు ఖండంవారే!

పోచెంజర్ కచ్చడం గురించి చరిత్ర మనవిచేశాను. అది వారికి దొరికినది ఒక 50 సంవత్సరాల కిందనే. కాని, అసలు ఆ కచ్చడం కట్టుకొన్న స్త్రీ చనిపోయినది ఒక నూరు సంవత్సరాలకు ముందయినా అయివుండాలి.

అప్పటికే ఈ ఆచారం యూరపు దేశాలలో చాలా వ్యాప్తిలో వుంది. నిస్సందేహం. ఈమాట రుజువు చెయ్యటానికి అయా మ్యూజియాలలో ఇప్పటికీ వున్న అనేక కచ్చడాలే చాలు. (వీటి బొమ్మలనే ఈ వ్యాసావళిలో ప్రకటిస్తున్నాను.)

యూరపులో తూర్పు పడమరా అనకుండా, వుత్తరం దక్షిణం అనకుండా సర్వత్రా ఈ ఆచారం వుండేదని కూడా నిర్ధారణ చెయ్యవచ్చును. అయా కచ్చడాలు దొరికిన స్థలాలను పట్టీ దొరికిన సన్నివేశాలనుపట్టీ ఈ మాటను ఎవరయినా అంగీకరించక తప్పదు.

ఇందులో ఒక్క విశేషం వుంది. ఇప్పుడు కనిపిస్తూన్న ఈ కచ్చడాలు చాలావరకు పశ్చిమదేశాలలోనివే. తూర్పు దేశాలలో దొరికిన కచ్చడాల నమూనాలులేవు. దీనిని పట్టి, ఈ ఆచారం అంతా పాశ్చాత్యులదే అనికొందరు నిర్ధారణచేస్తే చెయ్యవచ్చును. కాని, అది పొరపాటవుతుంది.

ఎందుచేతనంటే తూర్పు సామాన్యమైన ఖండం కాదు. అందులోనూ సంభోగవిషయంలో తూర్పుది అందెవేసిన చేయి. స్త్రీ పురుష సంబంధాన్ని శోధించి, నిర్వచించి, శాస్త్రాలు వ్రాసిన దేశం తూర్పు. కఠిన పరీక్షలు చేసి కళాస్థానాలను ఏర్పాటు చేసిన దేశం తూర్పు. ఇప్పుడిప్పుడు పాశ్చాత్యులు ఈ విషయాన్ని గుర్తిస్తున్నట్టుంది.

వయస్సులో మిన్ను మన్ను తెలియకుండా కిందా మీదా పడుతూ వుండే స్త్రీ పురుషుల చర్యలను పరిశీలించి, ఒక దారికి తీసుకొనివచ్చి ఎనభయి నాలుగు రకాలు అని పేర్లు పెట్టి చెప్పగలిగిన దేశం: స్త్రీ పురుషుల అవయవ పరిమాణాలలో వ్యత్యాసాల వల్ల కలిగిన నష్టకష్టాలను పరిశోధించి, ఆ చింత ఏమీ లేకుండా చేయడానికి సూక్ష్మమార్గాలు చూపించిన దేశం తూర్పు.

పెదవి ముద్దునూ పంటినొక్కునూ ఒక పెద్ద శాస్త్రభాగంగా చేసి దేశదేశాలకు వాటి రుచిని చాటించినది తూర్పుదేశం. ఈ విషయంలో తూర్పు దేశం వెనక పడ్డదంటే నమ్మకూడని మాట. నమ్మలేము.

అటువంటి తూర్పుదేశంలో, ఇనపకచ్చడాలు లేకుండానా? సాక్షాత్తు ఇనపకచ్చడాలతో ఇప్పుడుగూడా వ్యక్తులు కన్పిస్తున్న ఈ తూర్పులో, మరుగుబిళ్ళలు లేకపోతే మానభంగం అన్నట్టు భావించే ఈ దేశంలో, అవి లేకుండానా?

ఆ కచ్చడాలమీది చిత్రరచనా, ఆ కళా కౌశలమూ, ఆ ఉపాయ ప్రాశస్త్యమూ అన్నీ తూర్పు వాసనేకొడుతున్నాయి కాని, మరొకటికాదే. కాబట్టి తూర్పులో ఇవి లేకపోవడం ఏమిటి?

మూడునాలుగువందల సంవత్సరాల క్రింద వ్రాసిన వ్రాతలను పట్టిచూస్తే, నిజానికి, ఈ ఇనపకచ్చడాల ఆచారం తూర్పు దేశాల నుంచే పడమటికి పాకిందని తేటపడుతుంది. ఆ వ్రాతలే నమ్మాలి. ప్రాచ్యదేశాల విజ్ఞానం ఎలాగ ప్రసరించిందో, ఆ సంగతి తెలిసిన వారికి, ఈమాటే విశ్వాసపాత్రం అని తేటపడుతుంది.

అప్పుడేకాదు. ఇప్పుడు గూడా ఈ విషయాలను పాశ్చాత్యులు ప్రాచ్యుల దగ్గరనుంచి నేర్చుకుంటూ ఉన్నారు. ఇలా నేర్చుకుంటూనే వుంటారు. ఇంకా, ఇంకాను. ఈ రోజులలో తూర్పువాడు అంటే కొంత నాగరికత తక్కువ కలవాడు అన్న అర్థం అక్కడక్కడ వుంది. అలాగనే ఆ రోజులలో "అప్రాచ్యుడు" అంటే, తూర్పువాడు కానివాడు,

అన్న మాటకు పట్టి అనాగరికుడు అని అర్థం వుండేది. ఇప్పటికీ ఈ అర్థంలో వాడుక వుంది.

కాబట్టి ఈ కచ్చడాలు మనతూర్పే పడమరకిచ్చింది. సాంప్రదాయాన్ని పట్టిచూచినా, తెలివితేటలను పట్టిచూచినా, వ్రాతకోతలను పట్టిచూచినా, కచ్చడాల తయారీని పట్టిచూచినా, వీటిని మొదట కనిపెట్టినవారు తూర్పువారే. పాశ్చాత్యులు-ఇప్పటి లాగానే, అప్పుడుకూడా-అనుకరించినవారే.

దీనికి ఇంకా బలమయినకారణం: బహుభార్యాత్వం, అంటే ఎక్కువమంది భార్యలను చేసుకోవడం అన్న అచారం తూర్పులోనే విశేషం కదా ఇలాంటి నిరోధక సాధనాలు అవసరం.

## పాశ్చాత్యులే వీటిని కనిపెట్టారని ఇటలీవారి వాదన

# కరారా ప్రభువు కచ్చడం

ఈ ఇనుపకచ్చడాలు తూర్పు నుంచే పాశ్చాత్య దేశాలకు వెళ్ళాయని చెప్పాను. మన వారంతా అంగీకరిస్తారు; కాని, పాశ్చాత్యులు ఊరుకుంటారా? తెలివితేటలు అన్నీ మేమే గుత్తకొన్నాం అని అనేవారు కదా యూరోపియనులు.

ఈ ఇనపకచ్చడాలను కొత్తగా కనిపెట్టినవాడు ఇటలీలో "పాడువా" ప్రభువు(డ్యూక్) కరారా అన్నవాడని ఒక ప్రతీతి పుట్టించారు. అతడు వాడుక చేస్తూ ఉండిన ఇనపకచ్చడం, వెనిస్‌లో డ్యూక్‌గారి పాలెస్ (రాజభవనం)లో దొరికింది. దాన్ని జాగ్రత్తగా ఉంచారు. దాని చిత్రమే ఈ క్రింది చూపించింది.



ఇటలీవారి సిద్ధాంతాన్ని పట్టిన్నీ, యూరోపియనుల అభిప్రాయాన్ని పట్టిన్నీ, ఈ కరారా కచ్చడమే మొట్టమొదటిదన్నారు. అంతకు ముందువారు ఎక్కడా ఇలాంటి వస్తువును చూడలేదు. కాబట్టే అని అనుకోవాలి.

అదేకాకుండా మరొక కారణం గూడా వుంది. అదే ముఖ్యమైనదనుకుంటాను. ఏమిటంటే, ఈ కరారా ప్రభువు పరమ దుర్మార్గుడట.

ఇతనికి 'టైరెంట్ ఆఫ్ పాడువా' అని ముద్దుపేరు పెట్టారు. మనుష్యులను హింసించడానికి ఈ ప్రభువు చిత్రవిచిత్రమయిన సాధనాలు, యంత్రాలు తయారు చేయించేవాడు. పన్నులు వసూలుచెయ్యడానికీ, పగలు తీర్చుకోడానికీ, వినోదానికీ, వేడుకకీ, ఈ డ్యూక్ అనేకరకాలయిన హింసా సాధనాలు నిర్మించాడు.

పరస్త్రీలను తీసుకురావడానికీ వారినిపెట్టరాని బాధలు పెట్టడానికీ కూడా చిత్ర విచిత్ర మయిన సాధనాలు తయారు చేయించాడు. తన స్వాధీనంలోనికి వచ్చిన స్త్రీలు తప్పదార్లు తొక్కకుండా నొక్కి ఉంచడానికి ఇనపకచ్చడాలు గూడా తయారు చేయించాడు.

ఈ సాధనాలన్నీ కరారా ప్రభువే చెయ్యించాడనీ, అతనే ఈ కచ్చడాలు గూడా కనిపెట్టాడనీ అనుకున్నారు. కాని-నిజం చెప్పాలంటే, ఈ కచ్చడాలూ, అహింసా సాధనాలూ చాలావరకు తూర్పునుంచి అతను సంగ్రహించినవే. కాదూ పోదూ అంటే, కరారా డబ్బు గలవాడు కాబట్టి వాటిని కొంచెం నాజూకుగా తయారు చేయించాడని చెప్పవచ్చును. దేశకాలాలకు తగినట్టుగా, కొంచెం చమత్కారం కల్పించాడని చెప్పవచ్చును.

కరారా కచ్చడం చేయించడానికి కొంత శ్రమపడ్డాడు. 20 ముక్కలతో ఈ కచ్చడం తయారుచేయించాడు. బొమ్మలో 16 ముక్కలే కనబడుతున్నాయి; క్రింది భాగంలో మరి నాలుగు ముక్కలున్నాయి. ఈ ముక్కలు అన్నీ కీలు సంతనం చేశాడు. నడుమునకుగాని, తొడలకుగాని ఒత్తుకుని ఉండకుండా ఎక్కడికక్కడ వంగుతూ ఉంటుంది ఈ కచ్చడం.

దీనికి లోపల అంతా మెత్తగా శరీరానికి తాకేటట్టుమెత్తని తోలు అస్తర్ వేసి వుంది. ఈ అస్తరే అక్కడక్కడా చినిగిపోయి పటంలో కనబడుతూ ఉంది.

కోలగా రంపంపండ్లతో ఉన్న రంధ్రం ఉన్న రేకు ముందుభాగంలో ఉంటుంది. గుండ్రని రంధ్రంఉన్న రేకుముక్క వెనకనుండేది. రంపపుపండ్లు పెట్టడానికి కారణం వేరుగా చెప్పనక్కరలేదు కదా: తనకు తప్ప ఇంకొకరికి పనికిరాకుండా చేసి పడవేసి ఉంచడానికి ఈ ప్రభువు చేసిన పని ఇది. గుర్రాలకు కళ్ళెం వేసినట్టు, తన ఉంపుడుకత్తెలకు ఈ ప్రభువు రంపపు కచ్చడాలు పెట్టాడు.

ఇలాంటివి ఎప్పుడూ చూడనివారూ, విననివారూ కాబట్టి కరారా

ప్రభువే వీటిని సృష్టి చేశాడని అనుకున్నారు. తెలిసి తెలియని పెద్దలు వయసు మీరిన వృద్ధులు ఆ ఉద్దేశాలనే వారు తమ డైరీలలోనూ, రిపోర్టులలోనూ వ్రాశారు.

కాని, నిజం అదికాదు. 13వ శతాబ్దంలో, ముఖ్యంగా క్రూసేడ్ మతయుద్ధాలు జరిగిన కాలంలో యూరోపియను వీరులు చాలామంది తూర్పుదేశాలకు వచ్చారు. జెరూసలెమ్ కోసం అటు క్రిష్టియనులు ఇటు తురుష్కులు అరబ్బులు పోట్లాడారు. ఆ రోజులలో మన తూర్పున ఈ ఇనపకచ్చడాలు ఆచారంలో ఉన్నాయి.

క్రూసేడ్ యుద్ధాలకు వచ్చినవారికి వీటిసంగతి బాగా పట్టుబడ్డది. ఈ క్రిష్టియన్ వీరులకు గూడా ఇండ్లదగ్గర ప్రేయసులున్నారు కదా: ఇలాంటి సంరక్షణసూత్రాలు ఏమీ లేక పోతే వాళ్ళేమి పోకళ్ళు పోతారో అన్న అభిప్రాయం వీరికిగూడ కలిగిఉంటుందంటే తప్పా. వీరు ఒకరికి తెలియకుండా ఒకరు. ఒక్కొక్క కచ్చడం తీసుకుని ఇండ్లకుమరలినారంటే అధర్మమా?

వీరి మూలంగా ఈ కచ్చడం పశ్చిమ దిగ్విజయయాత్ర చేసింది. ఈ మాటే సత్యమని నిర్ధారణ చెయ్యడానికి, యూరోపియను భాషలలో అనేకులు వ్రాసిన విషయాలు ఇప్పటికీ రుజువు చూపవచ్చును. ఒక్కదేశంలోకాదు. ఇటలీ, ఫ్రాన్సు, స్పెయిన్ మొదలైన దేశాలలో ఈ వ్రాతలున్నాయి. వీటిని పట్టిచూస్తే, ఈ కచ్చడాల ఆచారం బాగా వ్యాప్తిలో ఉందని రూఢి కదా.

## యూరపులో విశ్వవ్యాప్తి

# 'కాల్మార్' 'క్లూనీ' కచ్చడాలు

ఇటలీ క్రూసేడ్లలో వెళ్ళాయి ఈ కచ్చడాలు. కరారా కచ్చడం లాంటివి అనేకం అప్పుడు ప్రచారంలో ఉండేవి. కొన్ని నమూనాలు ఇప్పటికీ మ్యూజియంలో కనబడతాయి.

ఇటలీ నుంచి మెల్లిగా ఇవి ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు మొదలయిన దేశాలకు ఎగ బాకినాయి. ఫ్రాన్సులో 17, 18 శతాబ్దాల వరకు వీటి ఉపయోగం ఉండేది. మ్యూజియంలలో ఉన్న కచ్చడాలను బట్టీ, కొంతమంది వ్రాసిన పుస్తకాలను బట్టీ, చిత్రకారుల బొమ్మలనుబట్టీ, అన్నిటికంటే చిత్రం, కోర్టులలో కేసుల రికార్డులను బట్టీ, ఈ కచ్చడాలు బహుళ వ్యాప్తిలో వున్న సంగతి రూఢి అవుతుంది.

వస్తువంటూ ఒకటున్నప్పుడు, ఈ వైభవం అంతా వుండటం ఆశ్చర్యమా? మనుష్యులలో స్వలాభచింత, హక్కు, జ్ఞానమూ, అసూయ ఇలాంటి గుణాలున్నప్పుడు, ఇలాంటి వస్తువులు పుట్టడం ఆశ్చర్యమా? ఏదీకాదు.

ఫ్రాన్సులో మొదేనా రాజకుమారుడి భార్య మేడమాయిల్ డివాలోయ్ అన్న స్త్రీ దీనివల్ల పడరానిపాట్లు పడ్డది. భర్తకు ఈమె మీద అనుమానం. అసలు విశాలహృదయం అన్నది అతనిలో లేదు. ఈ కచ్చడం బిగించాడు భర్త. పాపం! ఆ అమ్మాయి, తండ్రికి వ్రాసిన జాబులలో ఆమెబాధను అంతటినీ వెళ్ళగక్కింది.

ఆ రోజులలో (1700) బ్యూవట్ అన్న ఒక గ్రంథకర్త ఈ విషయాన్నంతటిని లిఖితరూపంగా వుంచాడు. చక్కగా ఈ ఇనపకచ్చడాలనే భర్త ఉపయోగించాడని తేటపడుతుంది.

అలగానే; ఈ ఆచారం జర్మనీకి ప్రాకింది. పదిమంది స్త్రీలతో పోవడం తనకు ఆచారం చేసుకున్న మగవాడు, తన స్త్రీనిమాత్రం ఈ కట్టుళ్ళలో పెట్టడానికి చూచేవాడు. కచ్చడాలు బిగించేవాడు. అయినప్పటికీ, ఈ కచ్చడాలు అంత ఎక్కువగా స్త్రీలను నిరోధించినట్టు కనబడదు.

ఎందుచేతనంటే, జర్మనీలో చిత్రకారుడూ, గ్రంథకర్తా, ఆ శతాబ్దాలలో, ఈ కచ్చడాల విధానాన్ని ఎగతాళి చేస్తూ బొమ్మలూ, గ్రంథాలూ వ్రాశారు. తాళాలువేసి తరుణులను నిరోధించడానికి చూచిన మగవాడు వట్టి మూర్ఖుడన్నట్టు తేల్చేవారు.

ఒక బొమ్మలో ఈ కచ్చడంతో ఉన్నస్త్రీని విడిచిపెట్టి భర్త ప్రయాణానికి పోతూ వుంటాడు. అప్రక్కనే మరొక బొమ్మ. దానిలో ఒక గంధోళిగాడు వికృతమయిన ఆకారంతో ఈగలను మూటకడుతుంటాడు. అంటే అర్థమేమిటి? ఇద్దరూ ఒక్కలాంటి తెలివి కలవారే అని కదా?

కాని జర్మనీ విషయంలో మాత్రం ఒక్కమాట చెప్పాలి. ఈ కచ్చడాలను చాలా అందంగాను, ఎక్కువ సొగసుగాను తయారు చేసేవారు. పైని అంతా నగిషీపని. లోపలి వైపు మెత్తని పట్టు, ముఖమల్ అస్తరు వేసేవారు. ఆ అస్తరు జారిపోకుండా ఈ రేకులను కుట్టివేసేవారు. అలా కుట్టడానికి సౌకర్యంగా వుండేటట్టు, రేకుల చుట్టూ చిన్నచిన్న రంధ్రాలున్నాయి. ఈ రంధ్రాలద్వారా సూదితో అస్తర్లు కుట్టేవారు. (కాల్మార్ బొమ్మ చూడండి)

అంతేకాదు. మరొక చమత్కారం గూడా కనబడుతుంది. ఈ కచ్చడం పారిసు నగరంలోని "క్లూనీ" మ్యూజియంలో వుంది.

దీనిలోని విశేషం ఏమిటంటే, దీనికి అన్ని ముక్కలూ భాగాలూ లేవు.

నడుము చుట్టూ గట్టి వడ్డాణం లాంటిది వుంటుంది. ముందుభాగంలో ఈ ఒడ్డాణానికి గట్టిగా బలంగా అతికి వుంచిన ఒక గట్టిరేకు కొంచెం ఉవ్వెత్తుగావచ్చి వెనుకకు వంగి వుంటుంది. ఒడ్డాణం బిగించి తాళం వేసిన తరువాత ఈ రేకు కదలదు. శరీరాన్ని అంటుకుపోయి వుంటుంది.



క్లాసీ కచ్చడం

ఈ రేకు వుండటం వల్ల అనాచారాలకు వీలుండదు. రెండుమూడు రేకులు కీలించి క్రిందా, మీదా చుట్టుకోవలసిన అవసరం వుండదు. దానివల్ల శరీరానికి కలిగే బాధ తగ్గుతుంది. ఉద్దేశంలో వున్న బందోబస్తు చక్కగా సాగుతుంది.

కొందరు ఈ ఒక్క రేకుగూడా ఇనుముతోనో, రాగితోనో, చేయించకుండా, గట్టి దళసరి దంతంతో చేయించేవారు. బొమ్మలో చూపించిన కచ్చడంలో ఈ రేకు దంతంతో చేసింది.

నడుముచుట్టు వుండవలసిన కమ్మర్‌బందు శరీరానికి ఒత్తుకోకుండా మెత్తగా వుండేటట్టు ఎలాగ చేశారో చూడండి. ఈ ఒడ్డాణం ఎలాంటి కొలత నడుముకయినా పనికి వచ్చేటట్టుగా, చక్కని ఏర్పాటుచేశారు. ఒక చివర, ఇంకొక చివర కిందికి పోతుంది. ఇప్పటి పట్కా ఒడ్డాణంలాగా.

నడుముకు తగినట్టుగా ఈ చివరలను సంతరించినప్పటికీ ఈ దంతపు నాలుక సరిగ్గా ముందుభాగానికే వస్తుంది. ఆ స్థితిలో దానికి బీగం వేస్తారు. (పటంలో ఈ తాళమూ, దాని చెవీగూడా కనపడతాయి.)

బీగం వేసిన తరువాత, ఈ దంతపు రేకు కావలసిన సంరక్షణ నంతటినీ ఇస్తుంది. కాల కృత్యాలకు ఎటువంటి అభ్యంతరమూ వుండదు. కాని, అనుమతి లేని అనుభవాలకు అవకాశమే ఉండదు. అదే కదా, పురుషులు కోరేది? దాని కోసమేకదా, ఇన్ని అగచాట్లు పడడం!

# 50 ఏళ్లకింద గూడా కోర్టులలోకి వచ్చాయి

ఇనపకచ్చడాల సంగతి ఒక్క మ్యూజియంలోనే (వస్తుప్రదర్శనశాలలోనే) కాదు. గ్రంథాలలో ఉంది. ఎన్నో పుస్తకాలలో వీటిని తడివారు. కొందరు విపులంగా వర్ణించారు. కొందరు కథలు వ్రాశారు.

అంతటితో తీరిపోలేదు: కోర్టులలో దావాలకుగూడా ఈ కచ్చడాలు కారణం అయాయి. వీటివల్ల కొందరు శిక్షలు పొందారు. పాశ్చాత్య దేశాలలో సర్వత్రా యీకచ్చడాలుండేవని రుజువు చెయ్యడానికి వేరే నిదర్శనం అక్కరలేదు.

మానవుడు అసూయ, క్రోధము, ఇలాంటి గుణాలకు లోకువ అయినప్పుడు, స్త్రీ అన్నది పురుషుడి సొత్తుకింద లెక్కకు వచ్చినప్పుడు, మగవాడు తన విధిని మరచిపోయి, తన శక్తిని కోలుపోయినప్పుడు, ఇలాంటి అగచాట్లు తప్పవు. దీనికి కాలంతో పనిలేదు; దేశంతో పనిలేదు. స్వభావంతోనే పని.

కాబట్టి, ఈ కచ్చడాల అనాచారం ఎప్పుడో పూర్వం ఇక్ష్వాకుల రోజులలో వుండేదని అనుకోనక్కరలేదు. ఎవరో అనాగరికులు వాడే వారనీ భావించవలసిన అవసరం లేదు. మొన్న మొన్నటిదాకా ఇవి వాడుకలో వున్నాయి.

ఇప్పుడు నోరువిడిచి చెప్పలేకుండా వున్నాం; కలంవదలి వ్రాయలేకుండా వున్నాం. అందుచేత ఈనాటి సంగతి బయటపడలేదు. కాని, నిజం ఆలోచిస్తే ఈ కచ్చడం పద్ధతి- ఒక రూపంగానో, ఇంకొక రూపంగానో-ఈ రోజులలో గూడా వుంది.

స్త్రీని సంతృప్తిపరచలేక, నిర్వీర్యులు, నిస్సారులు అయిన మగవారున్నంతకాలము ఈ కచ్చడాలూ, ఇలాంటి కట్టుళ్ళూ వుండక తప్పవు. ఈ పతివ్రతా నిర్వచనాలూ, ఈ నిరోధకశాస్త్రాలూ కలగక

తీరవు.

ఏమో పెద్ద బలసంపద వున్నట్టు, విలాసం అంతా తనదే అయినట్టు, మగవాడు పదిమందితో వినోదించటం; పనికిమాలిన పేడముద్దలాగా స్త్రీ పడివుండడం కావాలన్నవారు వున్నంతకాలం ఇలాంటి నీతిశాస్త్రాలు వుండకమానవు. శేషం వెంకటపతి మాటలకు ఆధారం కేవలం లేకపోలేదు:

*లోకములోన కొంద రబలల్*
*సతులన్ తనియించలేక, అ*
*స్తోకమనీష నన్యపురుషుల్*
*తమకాంతల నంటకుండ, తా*
*టాకులలోన వ్రాసిరి*
*పరాంగన కూడిన పాపమంచు....*

మొదటి చరణంలో చెప్పిన కారణం చాల బలీయమైనది. అలాంటి కారణమే ఈ ఇనపకచ్చడాలకూ దారితీసింది. సంతృప్తి పొందిన స్త్రీకి సంకెళ్ళు ఎందుకు అవసరం వస్తాయి? అసంతృప్త స్త్రీకి ఎన్ని సంకెళ్ళు వేస్తే మాత్రం ప్రయోజనం ఏమిటి?

ఈ దురవస్థ అప్పుడే కాదు. ఇప్పుడుగూడా వుంది. రేపూ వుంటుంది. కాబట్టి కచ్చడాల ప్రయోగం-నేను మనవి చేసినట్టు ఏరూపంగా నయినా-ఎప్పుడూ వుంటుంది.

ఫ్రాన్సులో ఒక వృద్ధుడు ఒక పడుచు పెళ్ళాన్ని చేసుకున్నాడు. గొప్పవాడు. కాబట్టి తాను పెళ్ళాము డాన్సులకు బాల్‌లకు పోతూ వుండేవారు. అందమయిన పిల్ల అని-అతను వృద్ధుడనికూడా, అనేమో-చాలామంది ఈమెను చుట్టుకొనేవారు. కాని, ఆ యమ్మ మాత్రం అలాంటి స్వభావం కలదికాదు. చాల 'పతివ్రత'.

అయినా భర్తకు అనుమానం-తన అశక్తియే దీనికి కారణంగాని, ఆమె ప్రవర్తన కాదు - దానితో బయలుదేరాడు. ఒక ఇనుపకచ్చడం తెచ్చాడు. ఆ నిరపరాధకు ఆ కచ్చడం తొడిగించాడు. బీగంవేసి బీగం

తనదగ్గర వుంచుకున్నాడు. ఇది జరిగి ఒక నూరు సంవత్సరాలయినా కాలేదు.

పాపం! ఆ ఇల్లాలు హృదయవేదన అపరిమితం. ఎంతో విశ్వాసం వున్నా ఈ విపరీతం జరిగింది కదా అని విచారం. విచారం కోపం అయింది. కోపం పగగా పరిణమించింది. కానీ, పగకి అతనిని చేయిస్తానని నిశ్చయించుకుంది.

తనకోసం ఇన్నాళ్ళూ ఆశపడుతూ వున్నవాళ్ళలో ఒక అనుచరుడిని పిలిపించింది. సంగతి చెప్పింది. అతడు మారు తాళం చేయించాడు. బంధవిముక్తి కలిగింది. ఆ, ఆగ్రహావేశంవల్లా, వాగ్దానంవల్లా, ఆ యువకుని గూడా అంగీకరించింది. కాని తరువాత పశ్చాత్తాపంతో ప్రాణాలు వదలివేసింది.

50 ఏళ్ళకింద బోర్డో అన్న పట్టణంలో ఒక కంపెనీలో పనిచేస్తూ వుండే ఒకడు, ఆ కంపెనీలోనే పనిచేస్తూ వుండే ఒక 13 ఏళ్ళ అమ్మాయిని బలవంతంగా చెరచి, బయటికి చెప్పావంటే నీ వుద్యోగం ఊడిపోతుంది అని భయపెట్టి ఒక నాలుగేళ్ళ పాటు తన ఆటలు సాగించాడు. ఇంతలో ఈ అమ్మాయికివున్న ఒక బంధువూ - అవ్వ - చనిపోయింది. ఈ పనివాడే మరొక ఇంటికి మార్చి పోషిస్తూవచ్చాడు.

ఇంకా ఎవరైనా దీనిని లాక్కుంటారేమో అని అనుమానం కలిగింది. అక్కడనుంచి కచ్చడం బిగించడం మొదలుపెట్టాడు. అప్పటికీ ఓర్చింది ఈ అమ్మాయి. కాని ఆ పనివాడి బుద్ధిమారలేదు. ఈమెకు విసుగు పుట్టింది. కంపెనీనుంచి ఒకనాడు తిరిగి ఇంటికి రాకుండా ఒక స్నేహితురాలి ఇంటికివెళ్ళి, ఆమెకు ఈ సంగతంతా తెలిపింది.

తన కచ్చడం ఆ స్నేహితురాలికి చూపించినది. ఆ ఇంటివారంతా ఆశ్చర్యం పొందారు. ఇలాంటి అక్రమాన్ని తుదముట్టించాలని ఆలోచించారు. అందరూ కలసి తీసుకోవలసిన చర్య తీసుకున్నారు.

కోర్టులో కేసూ, విచారణా, సాక్ష్యాలూ అన్నీ రహస్యంగా జరిగాయి. ఆఖరికి ఈ మహానుభావుడికి రెండు సంవత్సరాలు శిక్ష వేశారు.

## చేసినది పాతివ్రత్య సంరక్షణ
# అయినా వేసినది కఠినశిక్ష

ఈ ఇనపకచ్చడాలు తాతలనాటి పాత కబుర్లు కావు. మొన్న నేనిచ్చిన కేసులనుబట్టే ఈ మాట రుజువయి ఉండాలి. అవి యాభయి సంవత్సరాలకు ముందు జరిగినవి. నలభై ఏండ్ల క్రితం మరొకకేసు ఫ్రాన్సులో బయటపడ్డది. దీనిలో ఒక విశేషం ఉంది:

ఒక శిల్పికి అందమయిన భార్య ఉండేది; బుద్ధిమంతురాలే. అయినా శిల్పికి "సుందర మయిన భార్య శత్రుసమాన" అన్న అభిప్రాయం కలిగింది. ఒక కచ్చడం తెచ్చి, దాన్ని ఒక ఇజారు (చల్లాడం, షరాయి, లాగు) లో పెట్టి కుట్టించాడు. ఈ ఇజారు గట్టి గుడ్డతో కుట్టించాడు. బనియన్ లాగులాగా శరీరానికి అంటుకొని, కరుచుకొని ఉండేటట్టు చెయ్యించాడు.

ఏదో సాకు చెప్పాడు; ఇది తొడుగుకుంటే మంచిదన్నాడు; పెద్ద పెద్ద ఇళ్ళ స్త్రీలంతా ఇలాంటివి తొడుగుకుంటారన్నాడు. పాపం! ఆ ఇల్లాలు అవుననుకుంది; తొడుగుకుంది. శిల్పి మెల్లగా నడుముపట్కా బంధించి తాళంవేశాడు. అవసరం ఉన్నప్పుడంతా (మలమూత్ర విసర్జనలకు సైతం) తాళం తీస్తూవేస్తూ ఉండేవాడు. ఆయమ్మ అలవాటులను బట్టి ఉదయం ఒకసారి సాయంకాలం ఒకసారి తాళంతీస్తే ఆమె అవసరం తీరిపోయేదట.

ఒకనాడు, ఒక పెద్దయింటి ఇల్లాలు తన స్నేహితురాండ్రను అల్పాహారవిందుకు పిల్చింది. అంతా ఆడవాళ్ళపార్టీ. శిల్పి, భార్యను తీసుకొని వెళ్ళి నవ్వుకుంటూ అక్కడ ఆమెను విడిచిపెట్టి, మరొక రెండుగంటలలో వచ్చి ఇంటికి తీసుకుపోతాను అని చెప్పి వెళ్ళిపోయాడు.

విందు జరుగుతూఉంది. శిల్పి భార్యగూడా కులాసాగానే కొంతసేపుంది. ఇంతలో ఆమెకు పెరటికి వెళ్ళవలసిన అవసరం కలిగింది. ఎట్లా? ఓర్చుకుంది; సైరించింది. అరగంటయింది; ముప్పావుగంటయింది. మరి ఓర్వలేక చాలా అవస్థపడుతూ ఉంది.

అందరూ ఏమంటే ఏమని అనుకుంటున్నారు. అడుగుతున్నారు.

ఇంతలో "భగవదనుగ్రహం" వల్ల, తన భర్త వీధిలో నిలబడి ఈలవేస్తున్నాడు. ఈయమ్మ పరుగునపోయి, తాళము చెవి తెచ్చింది. కాని, వెనుకను వేసిఉన్న తాళం తెరవడం ఎలాగ?

విధిలేదని, విందుపెట్టిన ఇల్లాలిని రహస్యంగా పిలిచి, అమ్మా, ఈ తాళం తెరవండీ అన్నది. ఆ ఇల్లాలు దిగ్భ్రాంతి పొంది పోయింది.....పని తొందర తీరిన తరవాత ఏమిటీ విడ్డూరం అని అడిగింది. మెల్లగా సంగతంతా బయటపడింది.

స్త్రీజాతి కంతటికీ-అందులో అది ఫ్రాన్సు-ఇది అవమానం. అత్యుత్తమురాలయిన ఆ సుందరికి ఇది అకారణమయిన వేదన అని అక్కడి అమ్మలక్కలంతా నిర్ణయించుకున్నారు. కోర్టు కెక్కించారు శిల్పిగారిని. విచారణా సాక్ష్యాలూ అన్నీ జరిగిన తరువాత ఆ శిల్పికి శిక్ష విధించారు.

ఇలాంటిదే ఒక కేసు 1910 లో (అంటే పాఠకులలో అనేకులకు సమకాలికమే అవుతుంది) పారిసు నగరంలో విచారణకు వచ్చింది. అప్పటికి వార్తా ప్రచారాలు, పత్రికా ప్రచురణలూ విశేషించి ఉన్నాయి కదా. పారిసులోని వార్తలు లండను పత్రికలలో గూడా పడుతూ ఉండేవి. అందుచేత ఈ "పేరట్ కేసు" ప్రపంచ విఖ్యాతిని పొందిందనవచ్చు.

తక్కిన అన్ని కేసులలో లాగానే ఈ కేసులో గూడా మగవాడి ఒరిజినాలిటీ (స్వకపోల కల్పన) కొంత ఉంది. ఇతడుగూడా వట్టిమూర్ఖుడు గానీ, చదువుసంధ్యలు లేని మొరకుగానీ కాడు. పెద్ద అపాతికరీ డాక్టరు: గొప్ప మందులషాపున్నవాడు. మర్యాదస్తుడుగా జీవిస్తున్నాడు.

భార్య చెడుతిరుగులు తిరుగుతుందేమోఅని ఇతని భయము. భార్యను అన్నివిధాల నిరోధిస్తుండేవాడు. ఇదంతా కొంతహింసగా రూపొందింది. అనవసరంగా ఒక నిరపరాధిని ఇలా హింసిస్తున్నాడనే అని ఇరుగు పొరుగువారు అధికారులకు రిపోర్టుచేశారు. కాని, అధికారులు విననట్టు ఊరుకున్నారు.

డాక్టరుగారికి ఈ సంగతి తెలిసింది. ఇదికాదని ప్లాను మార్చి వేశాడు. తెలివితేటలన్నీ ఉపయోగించాడు. రట్బూరవ్వా లేకుండా, చచ్చిన కుక్కలాగ పడివుండే ఏర్పాటు చేశాడు. భార్యను బయటకు కనబడనీయకుండా చేశాడు.

కొన్నాళ్ళకి ఇతని ప్లాను మెల్లగా వీరికి వారికీ తెలిసింది. వారంతా విర్భాంతపోయారు. ఏమిటీ క్రూరకృత్యాలని అనుకున్నారు. ఇలాంటి ఘోరం జరగనీయ రాదని అధికారులచెవిలో పడవేశారు.

మరి నాలుగు రోజులు. పోలీసువారు వచ్చి ఇల్లు సోదా చేశారు ఏముంది? భార్యను గొలుసులతో డాక్టరుగారు మంచానికి కట్టి ఉంచారు. ఒక గొలుసు కాదు రెండు మూడు గొలుసులతో పదిలపరిచాడు డాక్టరు.

అక్కడితో తీరిపోలేదు. ఆ భార్య తొడుగుకొన్న గుడ్డల క్రింద సరిగా ఒక గొలుసు కవచం ఒకటి వుంది. పూర్వపు యుద్ధాలలో ఉక్కు రేకుల కవచాలే కాక, ఉక్కుతీగల కవచాలుండేవికదూ. (మ్యూజియము లలో ఇప్పటికీ చూడవచ్చును) ఇలాంటి గొలుసుల లాగులాంటిది తొడిగివుంది ఆ భార్య. ఆ వుక్కులాగుకు నడుముదగ్గర రెండుతాళాలున్నాయి. భార్య పాతివ్రత్యం కాపాడడానికి డాక్టరు ఇంతసన్నాహం చేశాడు.

దీనికి సంతోషించి ఒక పతకం ఇవ్వవలసిన ప్రభుత్వం, ఇతని మీద కేసు పెట్టింది. పత్రికల కెక్కించింది. "అభినవ ఒథెలో" అనీ, "భార్యను గొలుసులతో కట్టుట" అనీ, "గొలుసు కవచం తొడుగుట" అనీ, ఫ్రాన్సు పత్రికలూ, ఇంగ్లాండు పత్రికలూ పెద్దపెద్ద అక్షరాలతో ప్రకటించాయి.

డాక్టరుగారు తన తప్పును ఒప్పకున్నారు. ఇలా చెయ్యడాని కంతటికీ కారణం తన్ను తన భార్య మోసం చేస్తుందేమో అన్న ఒక్క ఉద్దేశమే అని చెప్పారు.

గొలుసులు ఇన్ని బిగించినా, ఆ భార్య అగదిలో ధారాళంగా నడవడానికీ, బుద్ధిపుడితే పియానో దగ్గరకుపోయి పియానో వాయించడానికి వీలుగా వుండేటట్టు వుంచాననిగూడా డాక్టరుగారు చెప్పాడు. ఇంత అభిమానం భార్యయందు చూపించినా, కోర్టువారు మాత్రం శిక్ష తగ్గించలేదు.

# కచ్చడాలు తయారుచేసే కార్ఖానాలు వాటి ప్రకటనలు

మానసంరక్షణమనీ, పాతివ్రత్య పోషణమనీ పెద్దపేరులు పెట్టి ఈ కచ్చడాలు వ్యాప్తి లోనికి తెచ్చారు.. నిజం ఆలోచిస్తే అదీ కాదు. ఇదీకాదు. ఇంకొకడు అనుభవిస్తాడేమో అన్న భావం. తన వస్తువు—స్త్రీ ఇక్కడ ఒక వస్తువుతో సమానమే-ఇతరులకు ఎందుకు ఉపకరించాలి అన్న బుద్ధి. అంతా నాకే అన్న స్వార్థపరత్వం. ఇవే ఈ కచ్చడాల నిర్మాణానికి దారితీశాయి.

ఈ విషయమే చక్కగా రూఢి అయ్యింది. ఆచారాలను పట్టిచూచినా, న్యాయస్థానాలలో కేసులను పట్టిచూచినా ఈ మాట నిజం అని బోధపడుతుంది. ఇప్పటికీ అనేక జాతులలో ఉన్న ఆచారాలు, అలంకరణవిధానాలు ఈ కచ్చడాల ఉద్దేశాన్నే నిరూపిస్తున్నాయని మనవి చేశాను.

గ్రంథాలలో కచ్చడాలున్నాయి. సామెతలలో 'తాళాలు' ఉన్నాయి. "ఏమీ ఎరగవు; తాళం వేసుకున్నావు" అని స్త్రీలు తమలో తాము ఎత్తి పొడుచుకోవడం చాల తరుచుగా వుంది.

ప్రస్తుతం ఇంకా అక్కడక్కడా ఈ కచ్చడాలు పెట్టుకొని బాహాటంగా తిరుగుతూ ఉన్నవారు కనబడుతున్నారు. తూర్పు పడమర అన్న బేధం లేకుండా ఈ కచ్చడాలు విశ్వవిహారం చేశాయి. అరంభము తూర్పు దేశాలలోనే అయినా, యూరోపియనులు ఈ కచ్చడాలకు ఒక మెరుగు పెట్టారు. రాక్షసకృత్యంగా ఉండవలసిన ఈ కచ్చడాలలో నాజూకుతనం, పనితనం, నేర్పూ, కౌశలం అన్నీ ప్రవేశపెట్టారు. శ్రమకు జంకలేదు. ఖర్చుకు వెనుకతియ్యలేదు.

ఈ కచ్చడాల వాడుక పదమూడో శతాబ్దం మొదలు 20వ

శతాబ్దందాకా అనగా దాదాపు ఏడువందల సంవత్సరాలు ప్రపంచంలో ఉందని చెప్పడానికి సందేహం లేదు. ఇప్పుడు గూడా, ఏ ప్రదేశంలో ఏ మహానుభావులున్నారో, ఈ కచ్చడాలతో కట్టి స్త్రీలను బంధించినవారు; ఉండకపోరు. మానవస్వభావంలో ఈ రకాలున్నంత కాలం, ఇటువంటి వాటికి, రూపాంతరాలుంటే ఉండవచ్చును-అవకాశం ఉండక తప్పదు.

ఇంత వ్యాప్తి దేశంలో ఉన్నప్పుడూ, ఈ కచ్చడాల అవసరం ఇంత ఎక్కువగా కనిపించినప్పుడూ, కచ్చడాలు తయారుచేయడానికి పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు, కార్ఖానాలు ఉండకపోతాయా. ఇప్పటి నగలషాపుల లాగానే అప్పుడు కచ్చడాల కార్ఖానాలుండేవి.

నగల వర్తకులు ఇప్పుడు వ్యయప్రయాసలకు జంకకుండా గొప్ప గొప్ప ప్రకటనలు చేస్తూ వున్నట్టే, అప్పుడు కచ్చడాల కంపెనీల వారు అపూర్వమైన ప్రకటనలు చేసేవారు. మంచి మంచి బొమ్మలతో రకరకాల కచ్చడాలు, పిండికొద్దీ రొట్టె అన్నట్టు డబ్బుకొద్దీ డాబు దర్పాలతో వుండేవాటిని, వర్ణించి, వర్ణించి, వాటి ఉపయోగాలు చెప్పి చెప్పి ప్రకటనలు చేసేవారు.

నగీషీవని కలవి, గిల్టు వేసినవి, లోపల ముఖమల్ అస్తర్లు వేసేవి వెండితాళాలుండేవి. .... ఇలాంటివెన్నో - ధరలను బట్టి- ప్రకటనలుచేస్తూ వుండేవారు.

1900 ఆ సమయంలో ఒక పెద్ద నగరంలో ఒక ప్రకటన చూడండి.

## అందమయిన కచ్చడాలు

| | |
|---|---|
| *స్త్రీల పాతివ్రత్య సంరక్షణ సాధనం* | |
| *తాళంతో సహా సాదా కచ్చడం* | *-120 ఫ్రాంకులు* |
| *పాతివ్రత్య సంరక్షణ సాధనం* | |
| *తాళంతో డీలక్సు కచ్చడం* | *-180 ఫ్రాంకులు* |
| *పాతివ్రత్య సంరక్షణ సాధనం* | |
| *వెండితాళంతో చక్కని అస్తరు* | *-320 ఫ్రాంకులు* |

దీనికింద పెద్దవర్ణన, చక్కని అచ్చు, మంచికాగితాలు. ఇదీ ప్రకటన. దీనిని చూచి, జాబులు వ్రాసేవారికి కొలతల కార్డు ఒకటి పంపించేవారు. దానివల్ల నడుము కొలత, తొడల కొలత మొదలయినవన్నీ కార్ఖానా వారికి తెలుస్తాయి. కచ్చడం తయారుచేసి పంపిస్తారు.

కచ్చడాల ఉద్దేశం కలిగించి ఊరించడానికి తగినట్లుగా చిన్న చిన్న పుస్తకాలలో ప్రకటనలు చేసేవారు.

ఇవి వాడుక చేసినట్టయితే భర్తలు నిశ్చింతగా వుండవచ్చు. భార్యలు అన్యులతో చరించరు, చరించలేరు అన్న నిండునమ్మకంతో గుండెల మీద చేయివేసుకుని హాయిగా ఏ దేశాలలోనయినా వుండవచ్చు. సిగ్గు, అవమానము పడవలసిన కార్యాలు ఇంటిదగ్గర తాను లేనప్పుడు జరుగనేరవు అని మనస్ఫూర్తిగా వుండవచ్చును.

ఇంటిలోని వయస్సు వచ్చిన ఆడపిల్లలు, కొమార్తెలు చెడ్డనడకలకు పోకుండా చెయ్యడానికి ఇంతకన్నా మంచిమార్గము చిక్కడం దుర్లభం. వర్ణసంకరాలూ, వంశకళంకాలూ కలగకుండా చేయడానికి ఏకైక సాధనం ఈ కచ్చడమే.

"నాలుగురూపాయల వెలచేసే బంగారాన్ని పెట్టెలలో పెట్టి ఎంతో భద్రంగా ఉంచుతామే, అంతకన్న ఎన్నోరెట్లు ఎక్కువ విలువగల స్త్రీల పాతివ్రత్యాన్ని తాళం వేయకుండా విడిచిపెట్టడం తెలివితక్కువ కాదా!"

ఇలాగ ఆ చెంపా ఈ చెంపా కొట్టినట్టుగా గట్టి ప్రకటనలు చేసేవారు. ఇంకొక మహా కంపెనీ మరికొంచెం ఘాటుగా ప్రకటించుకున్నది-ముక్కుమీద గుద్ది కొనకపోతే పరువుపోతుంది అన్నట్టు:

"మీ యింట (భార్యలకు) పుట్టిన పిల్లలు మీకు పుట్టినవారే అన్న నమ్మకం నూటికి నూరు పాళ్ళూ మీకు కావలసివుంటే తక్షణం ఈ కచ్చడాలను వాడుకచెయ్యండి. లేకపోతే-నిజం ఆ భగవంతుడికే తెలియాలి" అని ప్రకటించారు.

ఈ కంపెనీల వారే మగవారు కూడా వ్యభిచరించడానికి వీలు లేకుండా

వుండేటట్టు చేసే మగ కచ్చడాలను గూడ తయారుచేసి అమ్మేవారు. ఇవి ముఖ్యంగా ఆ రోజులలో చిన్నవారూ, బాలురూ దురభ్యాసాలకు లొంగిపోకుండా వుండేటట్టు చెయ్యడానికే ఉద్దేశించేవారని అనుకోవలసి ఉంటుంది.

ఇప్పటికీ, యూరప్‌లోనూ, అమెరికాలోనూ, అప్పుడప్పుడు, పెద్ద మనుష్యులు డాక్టర్ల దగ్గరకూ, వైద్య యంత్రాలు తయారుచేసే కంపెనీల దగ్గరకు వెళ్ళి "స్త్రీల పాతివ్రత్యం కాపాడడానికి (ఇతరులతో చరించకుండా కట్టిపడవేయడానికి అన్నమాట) ఏదయినా సాధనం వుందా" అని అడుగుతూనే వుంటారు.

పాతివ్రత్య సంరక్షణ అవసరం ఇంత ఎక్కువగావుందని గ్రహించి బ్రిటనులో ఒక గొప్ప డాక్టరు (ఒక యాభయి అరవయి సంవత్సరాల కింద) ఒక పుస్తకం వ్రాశాడు. అది వైద్య గ్రంథం. దానిలోని విషయం స్త్రీల పాతివ్రత్యమూ నీతి సంరక్షించే విధానాలూ విశేషాలు. ఈ డాక్టరు: (యం.డి. సర్జన్ గూడాను) అప్పటి పరిస్థితులను గురించి వ్రాయడంలో ముక్కూ మొగమూ చూడకుండా, వున్నదున్నట్లు ఘాటుగా వ్రాసేవాడు. ఇతని పుస్తకాలు ఇప్పటికీ పెద్ద పెద్ద లైబ్రరీలలో వున్నాయి—ఎవరూ చూడరుగాని.

ఈ పుస్తకంలో మూడు భాగాలున్నాయి. ఆ రోజుల్లో ముఖ్యంగా స్కాట్లండులోని స్త్రీలలో వుండే దురాచారాలు ఒకభాగంలో నిర్మొగమాటంగా వర్ణించాడు. రెండో భాగంలో ఈ దురభ్యాసాలు కట్టించడానికి సాధనాలూ, ఉపాయాలూ, చారిత్రకంగానూ, బుద్ధికుశలతతోనూ చర్చించాడు. ఈ కచ్చడాలు వాటి నిర్మాణవిధానము మొదలయిన విశేషాలన్నీ మూడోభాగంలో వ్రాశాడు.

దీనిలోనే బాలుర దురభ్యాసాలూ, వాటి నివారణ విధానాలు గూడా కొంత విస్తరించాడు. వాళ్ళకోసం కూడా కొన్ని కచ్చడాలు సూచించాడు.

గ్రంథాలతో కచ్చడాలు

# అటు ఇటలీనుంచి ఇటు స్కాట్లండు వరకు

ఈ ఇనుపకచ్చడాలు - సూర్యుడులాగ-తూర్పునే ఉదయించాయి- అవసరం వల్లనే అనండి, అత్యాచారంగానే అనండి. తూర్పువారే వీటిని వాడుకలో పెట్టారు. క్రూసేడు యుద్ధాలలో ఇటాలియనులకు, ముఖ్యంగా, ఈ తూర్పువారితో సంపర్కం కలిగింది. ఇక్కడ ఆచారంలో వున్న కచ్చడాల సాధనం ఏదయినావుంటే, తమ ఇండ్లలో వ్యవహారాలు చెడకుండా వుంటాయి కదా అని కలిగింది.

కచ్చడాల రవాణా తూర్పునుంచి పడమర వరకు ఆరంభించింది. ఇటలీలో ఒకరిని చూచి ఒకరు; ఆ తరవాత ఇటలీనిచూచి ఫ్రాన్సు, ఫ్రాన్సునుచూచి మరొక దేశం, ఇలా యూరోపు అంతా కచ్చడం విహారం చేసింది.

నగలలాగా నాణాలలాగా ఈ కచ్చడాలలో షోకు, సొగసు, సౌఖ్యం అంతా వుండేటట్టు చిత్ర విచిత్రంగా తయారీలు జరిగాయి. రకరకాల కచ్చడాలు, రకరకాల ఉపాయాలతో నిర్మాణం జరిగాయి. కార్ఖానాలు వీటిని వందలకొద్దీ తయారుచేసేవి. వర్తకులు వీటికి మంచి కాటలాగులద్వారా ప్రకటనలు చేసేవారు.

ఉపయోగించడంలో చిన్నచిన్న పొరపాట్లవల్ల, కోర్టులలో కేసులు వచ్చేవి. న్యాయాధికారులు శిక్షలు వేస్తూ వచ్చారు. అయినా, కచ్చడాల ఆచారం తగ్గడంలేదు. నలభై సంవత్సరాల కిందటి దాకా ఇవి వాడుకలో వున్నట్టు "దస్తావేజు" రికార్డులున్నాయి.

ఇంత వ్యాప్తిలో వున్నప్పుడు ఈ కచ్చడాలు గ్రంథాలకు ఎక్కాయంటే ఆశ్చర్యం ఏముంటుంది? కవిత్వంలో గూడా కచ్చడాలున్నాయంటే తప్పేమి! ఇంతకూ సారస్వతమూ, వాఙ్మయమూ అంటే ఏమిటి?

గతించిన కాలాన్ని విమర్శించి, ప్రస్తుతాన్ని ప్రకటించి, రాబోయే దానిని సూచించడమే కదా!

అందులోనూ కచ్చడాలు, సామాన్యమైన విషయం కాదు. మానవ స్వభావానికీ ఈ కచ్చడాలకూ సంబంధం గట్టిది. అలాంటి కచ్చడాలు సారస్వతంలోనికి ఎక్కకుండా వుంటాయా? తరువాత తరువాత నాజూకుతనం ఎక్కువయి, మడిబట్టలు అధికమయిన తరువాత మన పెద్దలు ఆగ్రంథాలను ధ్వంసంచేస్తే చెయ్యవచ్చును. కాని, సారస్వతంలోనికి ఎక్కకుండా మాత్రం వుండలేవు.

ఇటలీలో 1500 ప్రాంతాలలో వ్రాసిన ఒక చిన్నకథ: ఒక ఇల్లాలు ఒకడిని ప్రేమించింది. మహా ప్రయాసతో ఆ అందగాడిని తెప్పించి, అతడితో ఆనందిస్తూ భర్త వస్తాడన్న సంగతే మరిచిపోయింది. భర్తవచ్చాడు. వాడికి తగినశాస్తిచేశాడు; భార్యకు ఒక కచ్చడం కొనిపెట్టాడు. అలాగా ఆ కచ్చడాలు వ్యాపించాయని భావం.

ఇటలీలో మిలాన్ నగరంలో కచ్చడాల ఆచారం ప్రవేశించడానికి ఒక్క సన్నివేశం చెప్పుకుంటారు. క్రిస్టియన్ "నన్" (యోగిని అందాం) ఒకర్తె ఒక గొప్పవాడిని ప్రేమించింది, నన్ కాబట్టి కామాన్ని సన్యసించాలి మగవారిలో "మంక్" లాగానే. వీరిద్దరు ఒక వుపాయం పన్నారు. ఈ గొప్పవాడు ఒక మంక్‌లాగా వేషం వేసుకుని రాత్రి, పొద్దున ఆ మఠంలోనికి పోవడం అని నిర్ణయించుకున్నారు.

కొంతకాలం జరిగిన తరువాత ఒకనాడు యీగొప్పవాడు ఆ వేషంతోనే బయటకువచ్చి, వేషంలో ఉన్నానన్న మాటమరచిపోయి, తెలిసినవాడొకడుదారిన కనబడితే, వాడిని పల్కరించాడు. దానితో కథ అంతా బయటపడ్డది.

మంకులు మండిపడ్డారు. కచ్చడాలుంటేనేగాని ఈలాంటి అనాచారాలు ఆగవు అని నిర్ణయించుకున్నారు. మతగురువులు చెప్పిన మాటలు కదా అని మహాగౌరవంతో పెద్దలంతా ఇనుపకచ్చడాలు కొని, భార్యలకు అలంకరించారు.

ఫ్రాన్సులో ఈ ఇనపకచ్చడాల విషయం పెద్ద పెద్ద డిక్షనరీలలోనికి, నిఘంటువులలోనికి గూడా ఎక్కింది. వీటిని ఎలాగ తయారు చేస్తారో; ఏ విధంగా వుపయోగించేవారో ఆ సంగతంతా స్పష్టంగా తెలుపుతాయి ఆ నిఘంటువులు.

ఒక కవి వ్రాసిన పుస్తకంలో ఒకడు ఒక స్త్రీ దుష్ప్రవర్తనను గురించి విసిగి మాటలాడుతూ, "దీనికి ఒక తాళం తెచ్చి బిగించవలసిందే" అంటాడు. ఆ తాళం, ఆ బిగింపూ అంతా కచ్చడాల ముచ్చటే అని వేరే చెప్పనక్కరలేదు గదా.

స్కాట్లండులో సర్ డేవిడ్ లిండ్సే అన్న కవి ఒక ప్రబంధం వ్రాశాడు. దానిలో నాయికకు భర్త ప్రతీదినమూ ఈ కచ్చడం బిగించి తాళం తలకింద పెట్టుకొని నిద్రపోతాడు. నాయికకు నచ్చిన వాడొకడు వచ్చి ప్రార్థిస్తాడు. పాపం! నాయిక హృదయం కరుగుతుంది.

కాని, కచ్చడం వుంది! మెల్లగా భర్త తలక్రిందనున్న తాళం తెమ్మంటుంది. మొద్దు నిద్దరలో వున్న భర్త తలకింది తాళం సులభంగా దొరుకుతుంది.

తెల్లవారిన తరువాత, భర్త నిద్రలేచి, తలకింద తాళం చూసుకుంటాడు. లేదు. అయ్యో కుయ్యో అని, తాళంపోయిందని ఊరక విసుగుకుంటాడు. నేర్పుగల నాయిక, ఏమిటి? ఎందుకా గాభరా అంటూ వచ్చి అక్కడా ఇక్కడా వెదుకుతూ వున్నట్టు నటించి, మెల్లగా, తాళంచెవి తలగడ కింద పెడుతుంది.

తరువాత కొంతసేపటికి నాయిక భర్తతో "రాత్రి మీరు తాళం తలగడ కిందనే కదా పెట్టారు" అని అంటుంది. అవును అనుకొని భర్త మరొకసారి తలగడ కింద చూస్తాడు.

తాళం దొరుకుతుంది. భర్త ఆనందం ఎక్కువవుతుంది. నీ అంతటి మంచి భార్య ప్రపంచంలో ఎక్కడా లేదని నాయికను ముద్దుపెట్టుకుంటాడు. దానితో కథ కంచికి వెళుతుంది.

## బంగారు గొలుసుల కచ్చడాలు

# భార్యాభర్తలు పడ్డ చిత్తక్షోభ

సంతోషం కోసం చక్కనిపిల్లను పెళ్ళిచేసుకుంటారు. పెళ్ళిచేసుకోగానే పెడబుద్ధి పుడుతుంది. ఆ పిల్ల ఏమి చేస్తుందో అని అనుమానం కలుగుతుంది. అక్కడనుంచి ఈ రూపవతి పెళ్ళాం ఒక శత్రువులాగా కనబడుతుంది.

ఈ మాట నీతిశాస్త్రాల్లోనికి కూడా ఎక్కింది. క్షణం ఆలస్యమయితే అనుమానం. ఎవరితోనయినా - సోదరభావంతోనే కావచ్చు - మాటలాడితే కడుపుమంట. ఒకడు ఆమెను చూచితే తంటాయే: ఆమె ఒకడిని చూచినా తప్పే.

మానవస్వభావం అంత చెడ్డదని చెప్పలేము. కాని, మగవాడు అభ్యాసబలంవల్ల అంతటికి తీసుకువచ్చాడు--దానితో అగచాట్లు పడుతున్నాడు. నీడనుచూచి భూతం అని భ్రమిస్తాడు.

అందమైన పెళ్ళాం కావాలని ఒక నాయకుడు చాలా శ్రమపడి దేశాలు తిరిగి చక్కనిచుక్క నొకదానిని పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళిముచ్చట మొదటినెల పూర్తిఅయిందోలేదో, అప్పుడే అనుమానం కలిగింది. ఎవడు ఏమి చేసిపోతాడో: ఈ పెళ్ళాం ఏమి దగా చేస్తుందో: అని రాత్రి పగళ్ళు యాతన అరంభమయింది.

పాపం, ఈ బాధ సహించలేకపోయాడు. ఇటలీకి వెళ్ళి (చక్కని కచ్చడాలకు అప్పటికి ఇటలీ ప్రసిద్ధికెక్కింది) బంగారం గిల్టు, చక్కని నగిషీ, బలే పనితనమూ ఉన్న కచ్చడం ఒకటి కొనుక్కొచ్చాడు.

భార్యకు చూపించాడు; మెచ్చుకున్నాడు; ఇలాంటివి చాలామంది పెద్ద ఇంటి స్త్రీలు తొడుక్కున్నారన్నాడు. భార్యకు తొడిగాడు, అద్దంలో చూచుకో అన్నాడు. ఎంత అందంగా ఉంది అన్నాడు. తాళం వేసి

తాళం జేబులో వేసుకున్నాడు.

తమాషాగా ఉందని ఆ ఇల్లాలుగూడా కొంతసేపు నవ్వింది. కేరింతలాడింది. కొంచెం చిరాకుగా ఉన్నా, అలవాటు లేకపోవడం చేతనే అలా ఉందని అనుకుంది. పెద్దింటి ఆచారం తనకూ వచ్చిందికదా అని ఆనందించింది కూడాను.

ఆ కచ్చడంలో ఒక్క విశేషం ఉంది. కచ్చడం రేకులను ఒడ్డాణానికి తగిలించడానికి నాలుగు బంగారు గొలుసులుండేవి. ఈ గొలుసులలో నుంచి దూర్చి ఒడ్డాణానికి తాళం వుండేది.

కచ్చడం కొంత చికాకుగానే ఉండినా, దానివల్ల ఈ భార్యకు కొంత స్వేచ్ఛ వచ్చింది. ఇన్నాళ్ళలాగా, ఎప్పుడూ అంటిపెట్టుకుని భర్త ఉండటం తప్పిపోయింది. క్షణం ఆలస్యమయితే ఏంచేస్తున్నావన్న ప్రశ్నలు పోయాయి. ఎప్పుడూ ఖైదీలాగా, భర్త పర్యవేక్షణ కిందనే ఉండడం తీరిపోయింది.

స్వేచ్ఛగా స్నేహితురాండ్రను చూడడానికి, వేడుకలకు ఒక్కర్తె వెళ్ళడానికి కొంత అవకాశం ఏర్పడ్డది. ఎక్కడకు వెళ్ళినా భయంలేదన్న తృప్తి భర్తకు వుండేది. ఏదయినా అనుమానం కలిగినా, జేబులోని తాళం తడువుకొనేటప్పటికి ఆ అనుమానం అంతా ఎగిరిపోయేది. ఖజానా పెట్టె ఎక్కడుంటేనేమి? తాళంచెవి నా దగ్గరనేకదా ఉంది అని అనుకునేవాడు.

ఇలా కొంత స్వేచ్ఛగా ఉన్న రోజులలో ఒక అందగాడు తారసిల్లాడు ఈ ఇల్లాలికి. వీరిద్దరికి కొంత చనువు—పాపం ఏమీలేదు; ఉండడానికి వీలుగూడా లేదుకదా— కలిగింది. అది పాపచింతగా పరిణమించేదో, లేక కేవలం స్నేహరూపంగానే ఉండిపోయేదో, కాని భర్తకు అనుమానం కలిగింది. భార్యను దండించాడు. స్నేహితుడిని రానీయడంలేదు. పెళ్ళాన్ని మరొకవూరికి తీసుకుపోయాడు.

ఇంట్లో పనిచేస్తూ నౌకరు ఒకడు కొంచెం అందంగానూ, తన

స్నేహితుడి పోలికతోనూ ఉండేవాడు. భర్త ఆ స్నేహితుడిని దూరం చేసిన తరువాత, ఈ ఇల్లాలు ఈ నౌకరును కొంచెం ఎక్కువ ఆదరంతో చూస్తూవుండేది. తానెక్కడకు వెళ్ళినా, వెంట తీసుకుపోయేది.

ఒకనాడు ఈ నాయిక ఒక డాన్సుకు వెళ్ళింది. వెంటను ఈ నౌకరు గూడా వెళ్ళాడు. కూలాసాగా డాన్సు జరుగుతూంది. ఈయమ్మ గూడా సీతాకోక చిలుకలాగా చిందులు తొక్కుతూ ఉంది. ఇంతలో ఏకారణంచేతనో కచ్చడానికున్న నాలుగు గొలుసులలో ఒకటి తెగిపోయింది.

బిక్క మొగం వేసుకొని, బెంబేలుపడి, పాపం, ఈ ఇల్లాలు డాన్సును హఠాత్తుగా ఆపి తొందర తొందరగా ఒక గదిలోనికి వెళ్ళిపోయింది.

ఇదంతా చూస్తూ ఉన్నాడు నౌకరు. ఏమిటి చెప్మా ఈ వుపద్రవం అని ఆదుర్దాతో ఆ గది తలుపుదగ్గరకు వెళ్ళాడు. తలుపు సందులోంచి చూశాడు.

నాయిక తెగిన గొలుసు సదురుకుంటూ ఉంది. చిన్నదారం ముక్కతో ఒడ్డాణానికి కడుతూ ఉంది. నౌకరుకు ఆశ్చర్యం కొంత కలిగింది. ఆవేశం పూర్తిగా కలిగింది.

డాన్సుమళ్ళీ జరిగి పూర్తయిపోయిన తరువాత, ఈ నౌకరు ఏదో సమయంచూసుకొని మెల్లగా సరస సంభాషణలకు దిగాడు. రెండు మూడు నిమిషాలలో వీడి ధోరణి గ్రహించింది నాయిక. అపరిమితమయిన అసహ్యంతో అయిదువేళ్ళూ అంటుకునేటట్టు వట్టున ఒక్క చెంప పెట్టు పెట్టింది. ఆ వేళతోనే వాడి నౌకరీ అంతమయిందని చెప్పి, ఇంటికి పోయింది.

ఇంటిదగ్గర భర్త చూచాడు, కచ్చడం, గొలుసు తెగివుంది. అనుమానానికి ఇంకేమి కావాలి? చిర్రుబుర్రులాడాడు; చీదరించుకున్నాడు. మరింత పకడ్బందీగా గొలుసులు బిగించాడు. మరి పదికళ్ళు పెట్టుకొని, కనిపెడుతూ ఉండేవాడు.

ఇంతలో నాయికకు ఒక బిడ్డడు పుట్టాడు. దురదృష్టవశాత్తు, ఆ బిడ్డడు, అనాడు దేవిడీమన్నా చెప్పిన స్నేహితుడి మూడుమూర్తులతోనూ పుట్టాడు. అబిడ్డడుగూడా పదిరోజులకన్నా ఎక్కువకాలం బతకలేక పోయినా, భర్త అనుమానం తగ్గలేదు.

మనోతత్వవేత్తలు, శాస్త్రజ్ఞులూ, ఎంతో చెప్పారు. బిడ్డల అకారం ఒకరి విధంగా ఉండడానికి వ్యభిచరించనక్కరలేదన్నారు. ఎన్నో నిదర్శనాలు చెప్పారు. కురూపులకు మంచి స్ఫురద్రూపులు పుడుతున్నారు కారా అన్నారు. చిత్రాలూ పటాలూ అందమయినవి పడకగదులలో పెట్టడానికి ఇదేసుమా కారణం అన్నారు.

ఏమి చెప్పినా లాభం లేకపోయింది. ఆ భార్యను ఒల్లనన్నాడు. పగసాధించుకోవడానికి, భార్యకు మళ్ళా ఆ కచ్చడం తొడిగి తాళం తన దగ్గర ఉంచుకొని, భార్యను ఇంటిలో నుండి తరిమివేశాడు.

పాపం ఆ ఇల్లాలు ఏమిచేస్తుంది? దిక్కు ఏమీ కనబడలేదు. మెల్లగా మనసు ఆ మొదటి స్నేహితుడిమీదికి వెళ్ళింది. పరిస్థితులన్నీ అతనిమీద స్నేహాన్నే బలపరచాయి.

చాలా ప్రయత్నం చేసి, ఎంతో భోగట్టామీద ఆ స్నేహితుడిని చేరుకుంది. వారిద్దరి మనసులు కలిశాయి. తరువాత ఈ కచ్చడాలూ, ఆ బంగారపు గొలుసులూ అడ్డు వస్తాయా? కచ్చడం తాళం భర్త జేబులోనే ఉంది. వారిద్దరు కులాసాగా కాలక్షేపం చేసుకుంటూ ఉండేవారు.

## మగవారి రాక్షసకృత్యాలు

# కచ్చడాలకూ వ్యభిచారానికీ ఉన్న సంబంధం ఎంత?

ఆడుది నాసొత్తు అన్న బుద్ధి పుట్టింది. మగవాడు మర్కటమయి పోయాడు. ఎన్ని అనాచారాలకు పాలపడ్డాడో, ఎంత తెలివిమాలినతనం ప్రదర్శించాడో చెప్పలేము. ఆలోచనా పాలోచనా లేని వట్టి శుంఠ అయిపోయాడు. దయాదాక్షిణ్యం లేని క్రూరరాక్షసి అయిపోయాడు.

ఆడుది కావాలన్న ఉబలాటం అంతరంగంలో వుంటుంది. దానివల్ల సౌఖ్యం తనకు కావలసిందే. తన జన్మకు, తన జీవనానికి ఆడుది అత్యవసరం అన్నమాట ఈ మగవాడికి తెలుసును.

తన అక్క ఆడుది; తన తల్లి ఆడుది; తన భార్య ఆడుది; తన ఉంపుడుకత్తె ఆడుది. వీరి అందరివల్లా భవాన్ని, అనుభవాన్ని పొందుతున్నాడు. అయినా, మగవాడు స్త్రీని తిట్టినతిట్లు ప్రపంచంలో ఎవరూ ఏ వస్తువునీ తిట్టలేదు.

అంటే యమదూత అన్నారు. కఠోర విషసర్పం అన్నారు. మృత్యు దేవతకుదగ్గర చుట్టం అన్నారు. నమ్మకూడదన్నారు, నారీపిశాచం అన్నారు. గ్రంథాల నిండా ఈ తిట్లే. పుస్తకాలన్నింటిలోనూ ఈ ఉపన్యాసాలే.

ఆడుది అంటే అసహ్యంవేసేటట్లు చెయ్యడానికి ఎన్ని ఉపాయాలున్నాయో అన్నిటిని ఉపయోగించారు. ఎంత అన్యాయానికి ఒడికట్టడానికి వీలుందో అంతా చేశారు. ఇంకా తనివితీర లేదు. ఈ కచ్చడాలవంటి క్రూర పరికరాలకు కూడా దిగారు.

ఇంతకన్నా మగవారి తెలివి తక్కువతనం ఏమికావాలి? ఇంతకన్నా అసూయా, చూపోపమీ, ఇంకేమిటుంటుంది? అయినా పెద్దవారమని తట్టపాగాలు పెట్టుకొని మాటలాడతారు. గంటలూ కలాలూ పట్టుకుని వ్రాస్తారు. "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" అని.

అమ్మో! స్త్రీ దగ్గరకు చేరకు "అవసరదూరాత్" దూరంగా పారిపో అని వ్రాస్తారు. ఆడుదంటే మహా క్రూరసర్పానికన్నా కఠోర విషం ఉన్నదట. కర్కోటక విషానికయినా మందూ మంత్రం ఉంటే ఉండవచ్చునుగాని ఈ స్త్రీ విషానికి మరి మంత్రం లేదట.

ఇలాంటి ముద్దుపేరులతో ముచ్చట్లు వ్రాశారు, వ్రాస్తున్నారు. ఆడువారేమయినా అనబోతారేమో అని వారిని ఆ జ్ఞాన సముద్రంలోనే పెట్టారు. మగవారి సౌఖ్యం - అదిగూడా ఏమి సౌఖ్యం; కేవలం పశుసౌఖ్యం - కోసం స్త్రీలను వినోద వస్తువులలాగా ఉంచారు. పెద్దరికం చెలాయించారు.

ఆడువారే మగవారి సంగతి వ్రాయవలసివస్తే వారెంత చక్కగా వర్ణించి ఉందురో ఊహించు కోవలసిందే. మగవారి అయోగ్యత, అక్రమాలు, అశక్తి, అవకతవకలు అన్నీ వారు అచ్చొత్తినట్టు చూపగలుగుతారు.

కాని, వారిని వ్రాయనిస్తామా? రౌరవనరకంలో పడదొయ్యమా? నామరూపాలు లేకుండా నాశనం చేయకుండా ఊరుకుంటామా?

అలాంటి ప్రమాదం ఏమిరాకుండా ముందుగానే జాగ్రత్తపడ్డాం. పాతివ్రత్యం అనీ, పతిభక్తి అనీ, పత్నీధర్మం అనీ కొన్ని అసత్యాలు పుట్టించాం. దేశంలో వాటిని అల్లించాం. ప్రజల రక్తనాళాలకు ఎముకలకు గూడా ఆ ధర్మాలు పట్టించాం.

ఇంకమగవాడన్న వాడంతా దేవుడే. వాడు ఏమిచేసినా తప్పులేదు.

## ఎన్ని పురాణాలు వ్రాయడు తేటి ?
## అట్ల, మగవాడను వానికి దోషమున్నదే?

ఇలాంటి సూత్రాలతో ఆడవారిని వలలో వేశాం. ఇంక మగవారి అగచాట్లు వ్రాసే అదుది ఎక్కడుంటుంది? ఎంత సాహసం చెయ్యాలి?

ఆడవారిని అంత నిర్జీవంగా చేసి పారవేసినా మగవాడికి తృప్తితీరలేదు. ఈ కచ్చడాలు బిగించాడు, తాళాలు వేశాడు. పచ్చి పశువయినాడు. క్రూర రాక్షసుడయినాడు.

ప్రగల్భాలకేమి: నాగరికత కోసం పాటుపడుతున్నానంటాడు. ప్రపంచం అంతా ఉద్ధరిస్తానంటాడు. వేదాంతం అంటాడు. భాష్యాలు వ్రాస్తాడు. తన పశుత్వాన్ని తాను చూసుకోలేకుండా ఉన్నాడు. తన్ను తాను గుర్తించుకోలేడు.

దేనికి ఈ తిట్లు, ఈ కట్టుళ్ళు, ఈ కచ్చడాలు? దేనిని నిర్మూలం చెయ్యడానికి ఈ ప్రయత్నం అంతాను? అసలు వారించాలని అనుకున్న గుణం ఒకటి ఉందా? ఎందుకు ఉంది? ఆగుణం ఒక్క ఆడుదానికే ఉందా? మగవారికి గూడా కలదా? మగవారిని ఏమి చేశాము? ఈ ప్రశ్నలను ఎవ్వడయినా, విశాలహృదయంతో అడిగాడా? అడగడు. అలా అడగడానికి శక్తిచాలదు.

శక్తిచాలదు-ఒక్క అడగడానికే కాదు; ఆడుదానిని సంతృప్తి పరచడానికి గూడా శక్తి చాలదు. సంతృప్తి పొందిన స్త్రీకి కచ్చడాల అవసరం అన్నదే ఉండదని గ్రహించడానికి బుద్ధిశక్తి చాలదు. ఆ లోపాన్ని కప్పిపుచ్చడానికి స్త్రీని నోటికి వచ్చినట్టు తిట్టడం, కచ్చడాలు వేసి బాధించడం, ఇదీ మగవాడి నేర్పు.

స్త్రీలందరూ విచ్చలవిడిగా వ్యభిచరించాలని ఎవ్వరూ అనరు. అలా చెయ్యాలన్నా వీలుండదు. స్త్రీలందరినీ పతివ్రతలుగా చెయ్యడం ఎంత దుర్ఘటమో, అందరినీ వ్యభిచరించేటట్టు చెయ్యడంగూడా అంతా

దుస్సాధ్యమే, దీనిని గురించి సందేహం ఎవ్వరికీ ఉండనక్కరలేదు.

లోకంలో వున్న స్త్రీల కందరికి కచ్చడాలు బిగించినా వ్యభిచారం ఆగదు. అలాగే లోకంలోని స్త్రీలనందరిని విచ్చలవిడిగా స్వేచ్ఛగా విడిచి పెట్టినా, అందరూ వ్యభిచరించరు. స్వభావం అనీ, సందర్భం అనీ అనేక విషయాలున్నాయి. కొన్ని కారణాలు సమకూరితేగాని ఈ కార్యం కలగదు.

బుద్ధిగలవాడయితే మగవాడు ఆ కారణాలు లేకుండాచేసే ఉపాయం ఆలోచించాలి. మూలకారణం ఏమిటో గ్రహించాలి. అది ఎక్కడుందో- స్త్రీలోనా, పురుషుడిలోనా- తెలుసుకోవాలి. అప్పుడు ఆ కారణాన్ని నిర్మూలం చెయ్యాలి.

ఈ ప్రయత్నం అంతటిలోనూ సంభోగవాంఛ అన్నది ఆహార వాంఛలాగాను, నిద్రావాంఛ లాగాను, ఒక స్వభావసిద్ధమయిన వాంఛ అని మాత్రం మరచిపోకూడదు. ఈ వాంఛకు గూడా ఒక తృప్తి, ఒక తనివి అన్నవి ఉండాలి.

తిండి చాలక పోతే ఎంగిలి ఆకులకు పోతారు. నిద్ర చాలకపోతే మండుటెండలోనయినా బండరాతిమీద కునుకుతారు. అన్నిటిలోను ఇదే తత్వం.

మగవారి కృత్రిమయంత్రాలు

# బుద్ధిహీనతకు స్మారకచిహ్నాలు

నేడు నాజీ మారణయంత్రాల విజృంభణ అనాడు మగవాడి యీ కృత్రిమయంత్రాల విజృంభణ. ఈ యంత్రాలు రెండింటివల్ల మానవ నాగరికత ఎంత హీనస్థితికి వచ్చిందో తెలుస్తుంది. రెండింటిలోనూ మనుష్యునిలో ఉన్న పశుత్వం బయటపడుతుంది. రెండు శతాబ్దాలదాకా మరపురాని మహోనర్ధకాలుగా-చిరస్థాయిగా ఉంటాయి.

మగవాడి స్వలాభం కోసం స్త్రీని పనిముట్టుగా చేసుకున్నాడు. బానిసగా భావించాడు. దానికి ధర్మశాస్త్రాలు కల్పించాడు. స్త్రీ సరే అన్నది. ఎలాగో సుఖంగా ఉంటే చాలునన్నది.

ఆ సౌఖ్యం ఇవ్వడానికి శక్తి చాలిందికాదు ఈ మగవాడికి. దీనికి తోడు వీడికి లీలా విహారంమీద మోజు పుట్టింది. బహుస్త్రీ లాలసత్వం కలిగింది.

అసంతృప్త అయిన స్త్రీ ఏమి చేస్తుందో అని అనుమానం. తాను ఇతరులను చూచినట్టే, ఆడది గూడా పై చూపులకు పోతుందేమో అని సందేహం. తాను చేసింది ఒప్పు, ఆడది చేస్తే తప్పు అని సిద్ధాంతం.

దీనితో బుద్ధికుశలత అంతా వినియోగించాడు. తాళాలు వేయటానికి సమకట్టాడు. కచ్చడాలు తయారుచేశాడు. స్త్రీని వశంవదగా చేశానని అనుకున్నాడు. ఇంకా ఎవరయినా "తప్పతోవకు" పోతారేమో అని గ్రంథాలూ శాస్త్రాలూ, స్త్రీలను తిట్టడంతోను, వారినోళ్ళు కట్టడంతోను నింపివేశాడు.

తూర్పువారిని చూచి పడమటివారు. ఒకరిని చూచి ఒకరు ప్రపంచం అంతా ప్రాకిపోయాయి కచ్చడాలు. చివరకు ఇవి అలంకారాలయి

పోయాయి, కౌశలం చూపించడానికి మంచి అవకాశాలు కలిగాయి.

వింతచేతనూ, విశేషంచేతనూ గ్రంథాల కెక్కాయి ఈ కచ్చడాలు. దురంతాలవల్ల కోర్టుల కెక్కాయి ఈ కచ్చడాలు. మగవాడి దుర్బుద్ధి చేతను దురహంకారంవల్లను ఈ కచ్చడాలు శాశ్వతంగా నిలబడ్డాయి.

మగవారి కృత్రిమాలకు ఇవే స్మారకచిహ్నాలు. మగవారి స్వప్రయోజన బుద్ధికి ఇవే నిత్య సాక్ష్యాలు. మగవారి పక్షపాతబుద్ధికి ఇవే తార్కాణాలు.

ఇటువంటి వాటిని ప్రవేశపెట్టి స్త్రీల ఆత్మగౌరవం పోగొట్టాడు. తన గౌరవం కోల్పోయాడు. "దొంగవాడా కరువకురా" అన్నట్టు చెడుగు చేయడానికి సూచన ఇచ్చాడు.

ఇన్నిటినీ పరులమీద అధికారరీతిగానే ఆలోచించాడుగాని, తాను గూడా ఇలాంటి శ్రద్ధ పడితే బాగుండును అని అనుకోలేదు. తన్ను బాగు చేయడానికి యత్నించలేదు. లోకం మరామత్తుకు పూనుకున్నాడు. అందుచేతనే మగవాడి దోషం రెండింతలయింది. ఆడదానిలో తాను కోరిన మంచి గుణం తనలో లేదని గ్రహించడానికి జ్ఞానం చాలింది కాదు. తన స్త్రీకి ఒక కచ్చడం బిగించి, తాను మరొకయింటికి కచ్చడం భేదించడానికి బయలుదేరుతాడు-మూర్ఖుడు కాక మరేమి?

ఇప్పుడు కచ్చడాలు వాడుకలో ఉన్నాలేకపోయినా, ఇలాంటి గుణం మాత్రం ఇంకా ఉందనే చెప్పాలి. ఇంకా అనుమానాలతో దహించిపోతూ ఉన్నవారు చాలామంది ఉన్నారు.

వీరిలో చాలామందివి అకారణపు అనుమానాలు అని గట్టిగా చెప్పవచ్చును. ఆ అనుమానాలకు కారణం ఆడవారు కారు; ఈ మగవారే అని గూడా నిరాఘాటంగా చెప్పవచ్చును. ఏమంటే, తాను అశక్తుడు. స్త్రీని రంజింపగలిగిన నేర్పు తనకు లేదు. ఆడదానిని సంతృప్తిపరచే ఉపాయం తానెరగడు.

ఈ లౌక్యం ఇతరులకు చెప్పడుగాని తనకు బాగా తెలుసు. ఆ తెలియడంవల్లనే ఈ అనుమానం. ఈ అనుమానంతోనే ఇలాంటి రాక్షస కృత్యాలకు దిగుతాడు. ఇది తప్ప మరిమార్గం లేదనుకుంటాడు. అదే మగవాని పొరపాటు.

అలా కాకుండా, ఈ అసంతృప్తికి కారణం ఏమిటి అని తెలుసుకుంటే, ఇంత అనర్థకానికి దిగడు. సవ్యంగా ప్రవర్తిస్తాడు. అక్కడే కామశాస్త్రజ్ఞానం కావలసి ఉంటుంది. మగవాడికి ఆడదానికిగాని అసలు అల్పనిషిద్ధ గ్రంథం. ఆమాట అనకూడదు, వినకూడదు, మన కుటుంబాలలో.

కాపరాలు కూలిపోతే పోవచ్చు, రంకుతనం బలిసిపోతే పోవచ్చు. తప్పులేదు. కాని, పిల్లలు కామశాస్త్రం చదవకూడదు. చూడకూడదు. శుష్కసూత్రాలతో కట్టిపడవేద్దాం అనుకుంటారు. మానవ హృదయాలను, దెబ్బతింటారంటే తప్పా, ఇంత సన్నాహంచేసి తయారుచేసిన కచ్చడాలు నిరర్థకం అయిపోయాయంటే దోషమా? ఆమాటే చెప్పాడు అల్లసాని పెద్దన్న.

*ఇనుప కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల*
*తామరస నేత్రలిండ్ల బందాలుగారే?*



నార్డిస్కా కచ్చడం



పోచెంజర్ కచ్చడం

# "ఇనుప కచ్చడాల్"

మాయాశీలురు చంచలాత్ములను కంపారశూన్యు లాత్మైకకా ర్యాయత్తుల్, సమయానుకూల హృదయ వ్యాపార గోపాయనో పాయజ్ఞుల్ మగవారు... ...
... ... ... ... ... రామరాజభూషణుడు.

[మాయాదారులు, నిలకడలేదు, దయసున్న, స్వార్థ పరులు, సమయానుకూలంగా హృదయం దాచడంలో ఉపాయ మెరిగినవారు.]



ఎర్బాక్ కచ్చడం

మానవ స్వభావంలో ఎంత పశుత్వం ఉందో ఈ బొమ్మలే చాటుతాయి. మగవాడు స్వార్థం కోసం ఇలాంటి గౌరవవినాశకరమయిన యంత్రాలను తయారు చేశాడు. వీటి నిర్మాణంలో తన తెలివితేటలన్నీ కనబరిచాడు. పాతివ్రత్యాన్ని పోషించాననీ, ప్రపంచాన్ని ఉద్ధరించాననీ, ప్రగల్భాలు పలికాడు. తన ప్రయోజకత్వం చూచి తానే మురిసిపోయాడు.

తన తల్లి స్త్రీ అన్నమాట మరచిపోయాడు. తన అక్క స్త్రీ అన్నమాట విస్మరించాడు; తన స్త్రీకి ఈ కచ్చడాలుకట్టి ఆడుజాతి నంతటినీ అవమానపరిచాడు.



కరారా కచ్చడం



క్లానీ కచ్చడం



కాల్మార్ కచ్చడం

తన అజ్ఞానాన్ని చాటి చెప్పుకున్నాడు. స్త్రీ తత్వం అంటే ఏమిటో తనకు తెలియదు అని తన తెలివి తక్కువను కూడా దిక్కులు ప్రతిధ్వనించేటట్టు ప్రకటించాడు. తన మూర్ఖత్వాన్ని శాశ్వతంగా ప్రదర్శించుకున్నాడు.

అసహ్యకరమైన దుర్భావంలో పుట్టింది ఈ కచ్చడం. తూర్పునుండి పడమటికి వ్యాపించింది. పట్టణాలలో ప్రముఖుల తలలు పట్టింది ఏ పాపమెరుగని ఇల్లాళ్ళను పట్టి వేధించింది. ప్రపంచమంతటా విజయ యాత్ర జరిపింది. అతి ఉద్రేకానికి పోయి కోర్టులెక్కింది; విచారణలకు తీర్పులకు పాల్పడ్డది. ఎంతో ప్రాధాన్యాన్ని సంపాదించింది. కవుల కలాలనుపట్టి గ్రంథాలలో గట్టి నిలకడ ఏర్పరచుకుంది. మ్యూజియములలో నుంచి ఇప్పటికీ ప్రపంచాన్ని మేల్కొలుపుతూ ఉంది. మగవాడు ఎప్పటికయినా ఇలాంటివాడే సుమా అని మరచిపోనీయకుండా చేస్తుంది. మగవారిసి ఆడువారిని ఒక రీతిని హెచ్చరిస్తోంది.



పారిస్ కచ్చడం



ఓడెన్వాల్డు కచ్చడం